# శ్రీకృష్ణ తులాభారము.

అను

# తులసీ మాహాత్మ్యము.



ఐదంకముల నాటకము.

గ్రంథకర్త:-

డి. లక్ష్మీనరసింహ్వాంగారు.





ప్రకటనకర్త:-

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీసత్యనారాయణబుక్ డిపో,

రాజమహేంద్రవరము.



మొదటికూర్పు 2000 ప్రతులు.



రాజమహేంద్రవరమున

శ్రీరామ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1931.



[వెల 0-12-0

# ముఖ్యపాత్రధారులు.

పురుషులు.

శ్రీకృష్ణుఁడు—కథానాయకుఁడు.
నారదుఁడు—బ్రహ్మకుమారుఁడు.
ఇంద్రుఁడు—స్వర్లోకాధిపతి.
అక్రూరుఁడు—శ్రీకృష్ణుని భక్తుఁడు.
వసంతుఁడు—శ్రీకృష్ణుని చెలికాఁడు.
గర్గుఁడు—పురోహితుఁడు, ముని.
రామానధాన్లు—ఒక బ్రాహ్మణుఁడు.
వెంకటావదాన్లు—ఒక బ్రాహ్మణుఁడు.
గోవిందుఁడు }
దామోదరుఁడు } యాదవులు.
బృహస్పతి—దేవగురువు.

స్త్రీలు.

సత్యభామ—కృష్ణునిభార్య, కథానాయిక.
రుక్మిణి— ,, ,,
జాంబవతి— ,, ,,
మిత్రవింద— ,, ,,
శచీదేవి—ఇంద్రునిభార్య.
నలిని—సత్యభామ చెలికత్తె.



శ్రీరస్తు.

# శ్రీకృష్ణతులాభారము

అను

## తులసీమాహాత్మ్యము.

## నాంది.

శా॥ శ్రీకల్యాణగుణుండు మానిజన సంసేవ్యుండు నిత్యుండు లీ
లాకారుండభవుండు పాపహరణుండాద్యుం డనంతుడు సు
శ్లోకుండాశ్రితలోక పోషకుఁడు సచ్చారుండు పుణ్యుండు ల
క్ష్మీకాంతుండిలమిమ్ము మమ్ము సతముం క్షేమంబుమైఁగాంచుతన్.

శ్రీరస్తు.

# శ్రీకృష్ణ తులాభారము

అను

# తులసీమాహాత్మ్యము.

## ప్రథమాంకము.

అమరావతి నగరమునందొక విహారవనము.

(విషాదముతో శచీదేవియు నామె నూరడింపుచు ఇంద్రుఁడును ప్రవేశింతురు.)

అనుబంధము 1.

ఇంద్రు—దేవీ! సమాశ్వీల్లుము సర్వదాయిట్లు చింతాకుల స్వాంతవై యుండుటకు నేఁగతంబరయఁజాలకుంటిని తెలుపుము ఈ నీ దుర్భరవిచారమునకు హేతువేమి?

శచీ—(విచారముతో) మనోహరా! నావిచారహేతువు నీకు నేఁదెల్ప వలయునా? ఎంతలోమఱచితిరి నీకుమాత్రము యేల సంతాప కారణముఁగాకూడదు. గోపాలకృష్ణుఁడు మీతో రణమొనర్చి పారిజాతవనమునుఁగొనిపోవుట విచారకారణముఁగాదా?

ఇంద్రు—ఓహో! పారిజాతవృక్షంబు విషయమై యేనా? ఏమీ? అట్టిపవిత్రసుందర ప్రసూనవనములు మననందనవనమున లేవా? ఊరడిల్లుము ఈ నీవిచారకారణము నన్ను కార్యవిముఖునిఁగా జేయుచున్నయది. లెమ్ము

సీ. సహజసౌందర్య సం ♦ జనిత గులాబి ప్ర
సూన వృక్షములవి ♦ చోద్య మొసఁగ
మందార తరులతి ♦ సుందరా కృతిఁదాల్చి
ఘనతరంబుగ మన ♦ వనుల నుండ
హరి చందనలతావ ♦ నావళులవి బహు
చిత్రశోభితమయి ♦ స్థిరత నుండ
విరిజాజి పూఘన ♦ తరులవికరము నే
త్రముల కపూర్వ ప ♦ ర్వంబొనర్పఁ
గీ. గనవె సంతానసరులతి ♦ కాంతులీని
స్వాంతమున కెంతొ సంతోష ♦ భ్రాంతిఁగొలిపి
మధుపముల దనియింపు చుం ♦ డంగ మగువ
పారిజాతప్రవిటప వి ♦ చారమేల?

శచీ—నాథా! మీకీకష్టమేల? నేను మిమ్ము కార్యవిముఖినిఁగా జేసితినా? కొలువుకూటమునకేగి సభావిషయములకై విచారించుఁడు. నాయీ విచారణహేతువు మీకేల?

ఇంద్రు—అక్కటా! నాప్రాణ ధనంబవగు నీవు చింతాసాగరమున మునిగియుండ నేఁగొలువుకూటమునకేగి మోదమునందఁగలనా? ఏదీ? నీసంపూర్ణ మందహాస చంద్రికావికాసమును ప్రకాశింపఁజేయుము. నీదుర్భర విచారమును చాలించుము. ఇదే నేఁబోయి మనవిహార వనమునంగల కొన్ని ప్రసూన రాజములను కొనివచ్చెదను. సమాశ్వాల్లుము.

శచీ—మనోహరా! వలదు వలదు నాకు అన్యపుష్పములతోఁ బని లేదు. మీసభాభవనమునకు దారితీయుఁడు.

ఇంద్రు—దేవీ! నీవెట్రిభ్రాంతిమాత్రము వదలి జ్ఞానవతివికమ్ము. ఎల్లకాలము యిట్లు చింతాకుల స్వాంతవై యుండిన పారిజాత

వృక్షంబు లభించునా? అదిదైవవిధి. ఊరడిల్లుము. నీకన్నిటి ప్రివాహము నాకొలువు కూటమునకు మార్గరహితమొనర్చు చున్నయది. వెండియుబుధులకిది మరింత విచారపూరితముగ నుండెనట! లెమ్ము సంతోషము పొందుము.

శచీ—మగవారి మాటలయందున్న మాధుర్యము నేనెఱుగనా? మి మ్మేమి? నేనేమి? కార్యవిముఖునిఁగాఁ జేయుటేమి? మీయి ష్టానుసారముగ సభాభవనమున కేగుఁడు.

ఇంద్రు—(తనలో) ఎంతఁజెప్పినను ఈకాంతామణిమాత్రము సంతా పము వీడకున్నయది. కానిమ్ము నేబోయి కొన్ని సౌందర్య పుష్పరాజములనుకొని తెచ్చి యీనామనోహారి మనఃచింతఁ దీర్చి సంతృప్తిరాలిగానొనర్చెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

శచీ—కటకటా! నాధుడెంత వెఱ్ఱివాఁడు. నేపారిజాతా వృక్షంబు నకై విచారించుచుంటినని కాబోలును పారిజాతా సదృశం బులగు పుష్పములకొఱకు బోవుచున్నాఁడు. అంతియెకాని సత్యనాకొనర్చిన పరాభవము సుంతయు గ్రహింపడయ్యె గదా! హా! దైవమా! నాయీపరాభవాగ్ని చల్లారు విధా నము స్ఫురింపకుండెను.

అనుబంధము 2.

నార—(ప్రవేశము తనలో) కటకటా! సకలసృష్టిస్థితిలయకారణ భూతుఁడైన ఆపరమేష్టికి నేను ముద్దుల కుమారుఁడనయ్యు జానెడుపొట్టకు భోజనమార్జింపలేకపోయితి. ఇంక నితరుల మాట ఎట్లుండునోకదా!

గీ. కలహమును దివ్యనాటక ♦ కలనఁగాని
కడుపునిండదటంచు నా ♦ కమలభవుఁడు

మూడుపంక్తులు నాఫాల ♦ మున లిఖించి
బ్రతుకుమనె నేవిధాన నే ♦ బ్రతుకువాఁడ.

(శచీదేవినిఁగాంచి) ఓహో! నేనున్ను పారిజాతనంబునకై మి
క్కిలి పశ్చాత్తాప మనస్కుఁడనై వచ్చినందులకు తగిన సమ
యముఁదొరికినది. ఆనాఁడు సత్యమొనర్చిన పరాభవమునకై
ఈశచీదేవి పరితపించుచున్నయది. (ఆలోచించి) భళీ! ఇప్పుడు
నేను శచీదేవి నోదార్చు నెపమ్మునఁబోయి శచీంద్రులకు శ్రీ
కృష్ణుండు భార్యావిధేయుఁడుఁగాఁడు, భక్తవిధేయుఁడని వాదిం
చెద. వాదమున జయభేరీ మ్రోగించెదను. కేవలము ప్రేమ
కును భక్తికినుఁగల తారతమ్యము సత్యభామకు వృథామా
టలవలనఁ గాకుండ. కార్యరూపముగఁ జూపించి. ఆమెను
గర్వభంగముగావించి భక్తురాలింగావించెదను. ఎటులైనను
శచీదేవి విచారము మాన్పెదనుగాక! వహ్వా! నాకలహప్రియ
య నాటకవిలాసమునకు ప్రథమ సాదృశ్యరంగమిదియె.
ఇప్పుఁడే నేఁబోయి శచీదేవి నోదార్చెదను. (శచీదేవిని సమీ
పించుచున్నాఁడు)

శచీ—(చూచి తనలో) మరల నీకలహకారకుఁడు వచ్చుచున్నాఁడు.
ఏమిసేయనేచునోకదా! (ప్రకాశముఁగ) నారదా! నమ
స్కారము.

నార—కల్యాణమస్తు! శచీదేవీ! ఏమి నీవిట్లు దుర్భరదుఃఖమునకు
లోనైతివి?

ఇంద్రు
బృహ } (ప్రవేశింతురు)

ఇంద్రు—బ్రహ్మపుత్రా! ప్రణామములు.

నార—ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు.

ఇంద్రు—మునీంద్రా! మీయాశీర్వచనము ఫలించుఁగాక! ఆపీఠము నలంకరింపుఁడు.

బృహ—(స్వ) కలహమార్గమునకు సాధనమేమియు లేదుకాఁబోలును.

నార—శచీంద్రా! నేఁడు సభాభవనమునకు పోవకుంటివేల? ఈశచీదేవి దుర్భరదుఃఖమునకు కారణమేమి? వాఁడియు నీముఖారవిందమున విన్నదనంబు బొడచూపుచున్నయది. హేతువేమై యుండునో వచింపుము.

ఇంద్రు—కలహప్రియా! ఇది నీయొక్క కలహప్రియ నాటకకారణ ఫలమును, నీనిర్హేతుకజాయమాన కరుణాకటాక్ష పవిత్రఫలమునుఁగాక వేరుఁకారణముఁగలదా?

శచీ—నారదా! ఎఱుఁగని వానివలె నటింపవచ్చితిరా?

గీ. తీపిపలుకుల పారిజా ♦ తాపహరణ
రాజమునుఁ గొన్నదియుగాక ♦ రణమొనర్చి
విటపహరణాది కారణ ♦ విభవఫలమె
గాక మరిగతంబిక యేమి ♦ గలదుమాకు.

కలహభోజా! కన్నుబోఁడిచి కారణమడగఁ వచ్చితివా?

నార—ఏమీ? మీ యీదుర్భరవిచారమునకు మూలకారకుండను నేనా?

బృహ—నారదా! అది నీకును శచీంద్రులకేఁ గాక ప్రపంచమునకే విదితము.

ఇంద్రు—నారదా!

సీ. అలహిరణ్యాక్షు బో ♦ ధలు సహింపఁగలేక
విష్ణుదేవుని నుతి ♦ యించు నపుఁడు
క్రూరకంసుని ఘోర ♦ క్రూరతఁబడలేక
శ్రీరమాధవుఁ జింత ♦ జేయునపుఁడు

బలిదానవిలసిత ♦ ప్రతిభ సర్వము పరి
హారమై హరుబ్రతి ♦ మాలునపుడు
తారకసర్వమై ♦ త్యామారణముసేయ
బోవశంభుని వేఁడ ♦ బోవునపుడు
గీ. దీనజనబంధువై ఘన ♦ దీక్షమాకు
కరమునుపకారివైన నీ ♦ కరణినకట!
మాధవునిబంచియీ ♦ విధిగాథ బెంచి
కొంపగుల్లనుసేయ నీ ♦ కింపటయ్య.

నార—మహేంద్రా! అట్లు నేనొనర్చితినని నాపై నిందారోపణజేయు టతగదు. సర్వరక్షకుండగు సర్వేశ్వరుడే ఎల్లవారికి కష్టసుఖములు జయాపజయములు, కలిమిలేములు మొదలైనవి సంప్రాప్తింపజేసియుండ నన్ను నిందించనేల? నేను సర్వదా మీ క్షేమమునే కోరుచుందును. దైవోపకారినికాని దైవాపకారిని మాత్రముకాను. నీవిచారముడుగుము.

చ. అగణిత సత్యసంధునిర ♦ మాధవునాహవరంగమందు నొం
పగబలహీనుఁడేనయి వి ♦ పత్తులపాలయితెంచు సర్వదా
తగమదిచింతకూడదు వి ♦ ధాతలిఖించు సమస్తవార్త నే
వగిదిదలంచినన్ చెడదు ♦ పాతముతో బనిగాదు వాసవా!

బృహ—నారదా! నేనును అట్లే చెప్పఁదొడంగితినికాని, శచీంద్రులు విచారనిమగ్నులై యుండుటచే నావిషయము గ్రహింపరైరి.

శచీ—నిన్నగాక మొన్న మీరొనర్చిన సాహసకార్యము మాశుభము కొఱకైయేనా? కలహప్రియులకది ఆనందముకాబోలునే?

ఇంద్రు—"మేలులోకీడు" అన్నట్లు నారదా! నీవు మాకొనర్చినకార్యము మేలేయైనను విధికృతమున కీడుగా పరిణమించి యుండవచ్చును.

నార—దేవేంద్రా! నిజము గ్రహించితిని. ఇప్పుడు మీవిచారమునకు కారణమదియేనా? లేక కృష్ణునియుద్ధరంగమున గెలువలేదనియా? పారిజాతవృక్షంబును గోల్పోతిననియా?

ఇంద్ర—నారదా! గోపాలకృష్ణుని యుద్ధరంగమున జయింపలేక పోయితినను విచారము నాకెంతమాత్రమును లేదు.

గీ. సతము సత్యయొనర్చిన ♦ గతిదలంచి
యెటుపరాభవముసహింతు ♦ నెటులమరల
పారిజాతావనంబునే ♦ బగిదిగాంతు
నని విచారించుసతిగాంచి ♦ మనసుకరిగె.

శచీదేవి దుఃఖమునెన్నటికిని దీర్తునాయను విచారముమాత్రము నన్ను వదలదయ్యెను. నారదా! ఈస్వల్పవిషయములో దయదలంచుము.

నార—ఓహో! ఇదియా నీవిచారము. అమ్మా! శచీదేవీ! నీవిచారమునకు కారణమిదియేనా? తెల్పుము. ఈసారిమనకు తప్పక జయము సిద్ధించును. శ్రీకృష్ణుడు భక్తవిధేయుడుగాని భార్యావిధేయుడుగాడు.

శచీ—నారదా! నాదుఃఖమునకు హేతువిదియే? అఘటనఘటనా సమర్థుడవు. ఈనావిచారము తావక దీర్ఘవిచారముతోగాని అంతముకాదు. శ్రీకృష్ణుడు భక్తవిధేయుడనుమాట కార్యరూపమున ధృవపరచుము.

నార—శచీదేవీ! నీవిచారముమానుము. నీపరాభవమునకుతగిన ప్రతీకారపద్ధతి నాలోచించియేవచ్చితి. అయ్యది నీకు తప్పక హర్షప్రదంబని వేరచెప్పనవసరములేదు. వాసవా! ఇంక నీవు కొలువుకూటమునకు బోవచ్చును. నేనును బోయి కార్యప్రయత్నమునకై యుపక్రమించెదను.

బృహ—నారదా! కార్యాచరణాసక్తి గడంగిన పరాజయము మాత్రము ఘటింపకుండజేయుము ఇందులకు సర్వరక్షకుండైన భగవంతుడు భక్తవిధేయుడై నీకు తోడ్పడుగాక!

నార—గురూత్తమా! తప్పక ఈసారిమనకు జయము! జయము! అని ముమ్మాటికి జెప్పుచుంటి. ఏమందువేని? నాకీ కార్యమున గోపాలకృష్ణుడు సహాయకుడును. జయము ఘటించి తీరునని ఘంటాపదముగా నొక్కి చెప్పుచున్నాను.

ఉ. ఆవసుదేవనందనుడ ♦ నన్యకృపామయుండౌచు
నాకుప్రాణవశుండౌ యెవంచుతన♦యాశ్మదలంచిపతంబుపొంగుచున్
తావకతోడిమానినుల ♦ దర్పతమంబునంగాంచు సత్యకే
కావశ్యోదునిక్కవము ♦ గర్వపరాభవమింకధారుణిన్.

బృహ—తథాస్తు.

ఇంద్ర—నారదా! ఈఘనకార్యము నాచరణలోబెట్టి సంపూర్ణవిజయుండవై సర్వదా సురకృతజ్ఞతకాస్పదుండవు కమ్ము.

శచి—దేవమునిచంద్రా! కార్యాచరణవిజయుండవై నామనఃక్షోభము దీర్పుము. శ్రీకృష్ణమూర్తి భక్తవత్సలుండు కృపామయుండు భక్తవిధేయుండను ప్రమాణముమాత్రము ధృవపరచుము.

నార—ఇంద్రాణీ! ఈసారిజయము తథ్యము. ఇంక నేంబోయివచ్చెదను. మీరును వనవిహారము చాలించి సభాభవనమున కేగుడు.

ఇంద్ర—మంచిది నారదా! కార్యముపట్లా పట్టుందలవహింపుము.

(ఇంద్రాదులు బృహస్పతి నిష్క్రమింతురు.)

నార—(స్వ) ఇప్పటికి భగవంతుండు నాకలహప్రియ రూపకమునకు ప్రథమసాదృశ్యాంకము పూర్తి జేసియున్నాండు. నేనిప్పుండు ద్వారకానగరంబున కరిగి శ్రీకృష్ణుని భార్యలకు పోరాటముం

గల్పించి (ఆలోచించి) ఆ! నేపోరాటము పొసగించ నవసరము లేదు. రుక్మిణీదేవి కేపటిదినము పుట్టిన దినమట! విందారగిం చుటకు బంధు మిత్రాది జనంబులు వచ్చియున్నను భర్తరాక పోవుటచే రుక్మిణి విచారముతో నున్నదని వినియుంటిని. ఇప్పుడు నే ద్వారకకుఁబోయిన రుక్మిణీదేవి భర్తకొఱకు రాక మానదు. అచ్చట సవతుల జగడము సంఘటింపకపోదు. నాక మందముదంబుఁ గల్గకపోదు. ఆహా! ఏమి నాయానందము నారద కలహప్రణయ నాటకవిలాసము శ్రీకృష్ణతులాభార ముతోఁగాని మంగళము కానేరదు. భగవంతుఁడు కరుణాసము ద్రుఁడు నమ్మినవాని నాదరించితీరును.

గీ. కృష్ణుఁడెట్టులైన సరియె రు ♦ క్మిణి మనంబు
సంతసము జేయగా నేగు ♦ సత్యకీర్త్య
కలుగఁగాబోవదటుమీఁద ♦ కలహవనము
వృద్ధిఁగాఁ బోవదహహా! ♦ యీవిధముచేత.

ఇంక నేనాలశింపక కర్తవ్యమునకై గడంగి సాఫల్యముఁగ నెరవేర్చె దనుఁగాక!

అనుబంధము 3.

(నిష్క్రమించుచున్నాఁడు

ఇది ప్రథమాంకము.

శ్రీరస్తు.

# శ్రీకృష్ణతులాభారము

అను

# తులసీమాహాత్మ్యము.

## ద్వితీయాంకము.



ద్వారకావనము నందొక పుష్పవనము.

(శ్రీకృష్ణుండు, సత్యభామానళినులు ప్రవేశింతురు)

కృ—మనోహరీ! ఈబృందావన రామణీయకముఁ గాంచితివా?

అనుబంధము. 4.

గీ. అంధకారబంధురమగు గృ ♦ హంబునందు
విమల కర్పూరదీప స్వా ♦ మ్యమునుబోలె
జగమనేఁడి మహావిపుల స ♦ త్సౌధమందు
దనరుచుండెనుఁ గనవె బృం ♦ దావనంబు.

సత్య—నాథా! ఈబృందావన విహారము అత్యంతానంద దాయక మని చెప్పవలయునా? చూఁడుము. ఆమధుపము మధురసంబు నకై ఎట్లు ప్రయత్నించుచున్నదియో?

కృ—ప్రేయసీ! అవును. ఆచిత్రదృశ్యమెంతయు శృంగారశోభితమై నన్నును నిన్ను నేఁగాక ఈవనమునఁగల వృక్షంబులను సహి తము మోహపరవశులనుగాఁ జేయుచున్నదికదా!

సత్య—ప్రాణేశా! ఆమోహామే లేకున్న ప్రపంచమే శూన్యముకదా! నాయీ సహజలావణ్య శృంగారప్రణయ వీక్షణములే సర్వదా నిన్నీ సత్యభామా భవన బంధితునిఁగా సల్పినవి.

కృ—(తనలో) ఆహా! భక్తియన నేమియో తెలియక కేవలము ప్రేమ తత్వమునె యాధారముఁజేసికొని ఈసత్యాదేవి వెఱ్ఱియూహలు లోనగుచున్నది. కానిమ్ము ప్రేమయందును భక్తియందునుఁ గల తారతమ్యము నీమెకు కొలదిదినములలోఁ గనపర్చెదను. (ప్రకాశముగ) నిజముదేవీ! నిజము భక్తికన్నను ప్రేమయే ప్రబలమైనది. అందుచేతనె నీప్రేమసురాపానమునకు నేను వశ్యుఁడనైతిని.

గీ. తిట్టినను కాళ్ళఁదన్నినన్ ♦ కొట్టియున్న
సత్యయేకదా! లావణ్య ♦ ముత్యమనుచు
కేవలము ప్రేమతత్వపు ♦ కీలుఁగనక
నీకెవశ్యుఁడనైతినే ♦ నీరజాక్షి!

వసం—(ప్రవేశించి) కృష్ణా! ఈదినంబున చాల ఆలస్యముఁ జేసితి నయ్యా!

కృ—కారణము.

వసం—కారణమా? మాయింటిదాన్ని ప్రార్థించఁడములో సరిపోయి నది.

కృ—(నవ్వుచు) వయస్యా! సవిస్తరముఁగా దెల్పవోయి.

వసం—ఏమున్నది? వనవిహారమునకురమ్మని ఎంతబ్రతిమాలిననువినక కేవలము కుక్కను గద్దరించినట్లే గద్దరించినదయ్యా! అసలు ప్రేమ అనగా ఎట్టిదియో గ్రహించలేని మూఢురాలు.

కృ—చెలికాఁడా! నీహాస్యరస ప్రవాహమున కంతుఁగలదా! సరే పిమ్మట నేమిజరిగినది.

వసం—జరుగుటయేమి? బాగుగనే జరిగినది. కాని ఈవేళకు మాత్ర
ముత్కుద్బాధ దీర్చుకొనుట కష్టమని.

కృష్ణు—మిత్రమా! ఎందుచేత ?

వసం—ఎందుచేతనని వేరయడుగవలయునా ? వనవిహారవార్తయె
దానికి క్రోధవిహార వార్తయైనది. నాకు తెడ్డిమడమపోట్లు
నీకు కాలిమడమపోట్లు మాత్రము తప్పవు.

సత్య—వయస్యా! నీకునిజముగా తెడ్డిప్రహారములుతప్పక కావలసిన వే?

వసం—కావలసినదే తల్లీ! గర్వభంగము సహితము.

కృష్ణు—వేడుకచెలికాఁడా! నావంటి వానిని కూఁడ నిర్లక్ష్యముగఁ
జూచి పరిహాసించినందులకు నీకు తప్పక గర్వభంగము కావ
లసినదే ?

(అప్పుఁడు జాంబవతీ మిత్రవిందా రుక్మిణీదేవులు ప్రవేశింతురు)

రుక్మి—ప్రాణేశ్వరా! సూర్యాస్తమయము కావచ్చినది మందిరమున
కేగుదము దయచేయుఁడు.

జాంబ—నాధా! మీపట్టపుమహిషి మీతో పనిఁగల్గి వచ్చినది.

కృ—భీమరాజపుత్రీ! నాతోఁబనిగల్గి వచ్చితివా ?

రుక్మి—మనోహరా! మిక్కిలి అవసరమైన పనిగల్గియే వచ్చితి.

కృ—దేవీ! వచింపుము.

రుక్మి—నందనందనా! నేటిదినము నేపుట్టినదినము గనుక.

చ. ఇలజనియించినట్టి దిన ♦ మీదినమౌయని వైభవంబుగా
సలలిత భక్తిబంధుజన ♦ శాస్త్రపు బ్రాహ్మణులాది మిత్రులన్
బిలచితి, విందుసేయ దయ ♦ వీడక నాధ! కృపామయుండవై
చెలియగు సత్యతో వెసలి ♦ చెచ్చెరవచ్చి యనుగ్రహింపవే.

వసం—భళీ! ఈవేళ మాయింటిది నన్ను గదిమినందులకు, వేడుక చెలికాఁడు చెప్పినందులకు ప్రతిఫలముఁగా రుక్మిణీదేవి యింటి వద్ద పప్పుదప్పళములు చేకూరును.

కృ—(నవ్వుచు) సత్యా! నీ యక్కవినయ ప్రార్థనము ఆలకించితివి కదా! వెళ్ళి ఆనందింతమా?

సత్య—ఓహో! మీపట్టమహిషికి బుట్టిన దినమైన నాకు మెట్టినదినము. నళినీ! నీకు నేదెల్ప లేదటే?

నళి—అవునమ్మా! అవును! నీమెట్టినదినంబని యేకదా పప్పు దప్పళములు పిండివంటలు సిద్ధముఁజేయించితివి.

వసం—(స్వ) దీనిదుంపతెగ! ఇదెంతనూయలమారిగుంపరా దేవుఁడా! సత్యము వెల్లివిరియునట్టే మాటలు జారవిడిచినది.

నార—(ప్రవేశించి) మంచిసమయమునకే వచ్చితిని. రుక్మిణి పుట్టిన దినమని కృష్ణునివిందునకు బిలువవచ్చి హాతోస్మియైనట్టుల రుక్మిణిదేవి ముఖారవిందమే తెల్పుచున్నది. సత్యక్రోధకషాయితరుఃశితనేత్రయైనటుల దోఁచుచున్నది. కానిమ్ము ఏమికానున్నదియు చాటుననిలిచి ఆలకించెదను. (చాటుననిలువబడును.)

జాంబ—సత్యా! రుక్మిణి మన ప్రాణేశ్వరుని భక్తిపురస్సరముగా వేడికోలొనరింపుచుండ నీవేదియో మెట్టిదినమని మెట్టవేదాంతము నడపుచుంటివేల? పో నీయింతఃపూర్వము నామెట్టినదినమని ఎవ్వరితోనైన వచించియుంటివా?

సత్య—అవును! నేనెప్పుడు చెప్పిన నేమాయె? అట్లు చెప్పిన నన్ను అడుగువారెవ్వరు?

రుక్మి—సోదరీ!

గీ. భువిమహాత్ముల జన్మను ♦ త్సవము లెన్నో
జరుపవింటివి కాని నీ ♦ సరణి నెచట

మెట్టినదినంబు విందులు ♦ బెట్టువారు
గలరె? ప్రజవిన్ననగుబాటు ♦ గాదెచెలియ!

వసం—మెట్టినదినమునకాదుకాని గిట్టినదినములలోమాత్రము ప్రజలు ప్రపంచమున సర్వదా తద్దినములు చేయుటమాత్రము నిజము.

సత్య—ఏమీ? వ్యక్తి జనించినదినములెల్లా పర్వదినంబులు కాఁగూడదా? ఆవ్యక్తి చరిత్రము పవిత్రమైనదైన గ్రంధరూపకముగ వ్రాసి నిరంతరము పఠించకూడదా? చదివి వినువారికి శ్రవణానందముసేయకూడదా?

కృ—సత్యా! వృధావాగ్వివాదములో కార్యసాఫల్యముకాదు. నీయభిప్రాయమేమి?

సత్య—నాథా! నాయభిప్రాయమేమని మరల నడుగుచుంటిరా? ఇతఃపూర్వము నామందిరమునకు బయలుదేరి యింతదవ్వు మీరు రాలేదా? సరే! మీయిష్టానుసారముగ నెవరిమందిరమునకరిగిన నెవరువారింతురు. పోవచ్చును. ఈసత్య నీప్రయత్నమునకు భంగకారికాదు.

వసం—ఈవేళనాకు తెడ్డిపోట్లు, నీకు కాలిమడమపోట్లు, దప్పవని కృష్ణుని కింతకుమున్నే జ్ఞప్తికిదెచ్చియుంటిని. ఇంతమంది భార్యలుంటే ఒక్కరోజులోనే నాజీవితమంతమవునురా దేవుఁడా!

కృ—(స్వ) సత్యకు కోపము ప్రబలమైనది. నిత్యమూ సత్యకున్నటువంటి సహజగుణమేయిది. కానిమ్ము అనతికాలములో నారద ప్రయత్నము భంగముఁ గాకుండ సత్యకుమాత్రము గర్వభంగము ప్రాప్తింపచేయనా? (ప్రకాశముఁగ) రుక్మిణీ! సత్యాదేవి ప్రత్యుత్తరము వింటివికదా!

జాంబ—నాథా! సత్యాదేవి ప్రత్యుత్తరమత్యంత సంతోషదాయకమే కాని! ఒక్కమనవి. ఎన్నఁడును బ్రతిమాలరాని రుక్మిణీదేవి వచ్చి నేడు మిమ్ము భక్తిపూర్వకముఁగ విడోల్కులకు వేడి

కోలొనరింపుచుండ ఆమెకోర్కెనువ్యర్థపుచ్చకుండు. లోకంబున పతులైనవారు సతివాంఛఁ దీర్చుట సమంజసము కావున.

క. పుట్టినదినమని యాశతో
చుట్టములను బిలిచి భక్తి ♦ సూత్రములో వి
స్పష్టున మదవతి బిల్వగ
గట్టిగ నిపుడచటికేగ ♦ గరుణింపగదే.

రుక్మి—నాథా! జగన్నాథా!

శా. ఓరాధారమణా! ముకుంద! వరదా! ♦ యోదీనమందార! యో
కారుణ్యాకర! పాపసంహరణ! యో ♦ గంభీర చిద్రూపకా
సూరిప్రస్తుత! యోజనార్దన! హరీ! ♦ జోహారులోయంచు వి
స్తారంబున్ స్తుతియింపుచున్ననను యా ♦ నందింపగా జెల్లదే.

మిత్ర—నాథా! ఏమి మాట్లాడరు?

కృ—సఖియలారా! సత్యసమ్మతించిన నాకు సమ్మతమే? కావున సత్యనే వేడికోలొనరింపుడు సత్య కనికరించిన క్షణములో నేను మీామందిరమునకు వచ్చెదను.

నార—"ఆడబోయినతీర్థమెదురాయె"నన్నట్లు నాకోర్కెఫలించినదను మాట వాస్తవము. ఈసత్యప్రాణమునైన విడుచునుకాని, కృష్ణుని మాత్రము విడుచుటకు బాపుటకల్ల.

వసం—(స్వ) మాధవుఁడంతటి మాధవుఁడే ఆడుదాని మడుగులకు దోసిలొగ్గుచుండ; ఇంక నావంటి పామరజనులమాట ఏలా గుండునురా దైవమా!

జాంబ—ఏమి? నాథా! ఏమనుచుంటివి. సత్యనే వేడవలెనా?

గీ. పతి యిహపరసుఖంబని ♦ సతికరంబు
వేడికోలొనరింప సం ♦ ప్రీతిఁగనక
సత్యనడుగుమనుటిదేటి ♦ సరసమయ్యా
పతికిఁగాని స్వాతంత్ర్యము ♦ సతికిఁగలదె?

మిత్రి—పిల్లి పిల్లులనందుఁగల తగవు కోతిఁదీర్చునను సామెత యట్లున్నది. నాథా! సత్యవంటివారము మేముకామా?

ఉ. ప్రాణధనంబపేక్షమనుచు ♦ బ్రార్థనసల్ప యనన్యభక్తి, నా
ప్రాణధనంబగల్గును కృ ♦ ష్ణమతి సల్పుఁడటంచుబల్కు నీ
ప్రాణధనంబు సత్యమె? ధ ♦ రాస్థలి రుక్మిణిదేవియేల మీ
ప్రాణధనంబుగాదు? మరి ♦ ప్రాణధనంబుల మేముఁ గామొకో.

రుక్మి—నాథా! అటులేచేసెదను. (సత్యభామ సన్నిధికేగి) చెల్లెలా!

గీ. ఏజగన్నాథుఁ డర్థిష్ఠ ♦ లీల త్వదీయ
నాథుఁడాయెనో మాకును ♦ నాథుఁడతఁడె
కాన మముదూలనాడక ♦ కరుణఁదలచి
ధన్యఁజేయవె నిన్ను ప్రా ♦ ర్థనము జేతు.

సత్యా! బంధుజనమిత్రాది సమూహములో నాపరువు ప్రతిష్ఠ నిల్పుము. సర్వదా నీకు నేకృతజ్ఞురాలను. నీవు "సరే" యన్న జాలునట! అనుగ్రహించి నాథునితో సహా నీవుసహితము వచ్చి నన్ను ఆనందింపఁజేయుము.

సత్య—బాగుగనేయున్నది. నాథుని మీగృహమునకుఁబొమ్మని చెప్పుటకు నాకు స్వతంత్ర్యముఁగలదా? లేక నామాట వినునా? నీవేమో భార్యాసమూహములో పట్టమహిషివి, నీకుఁలోఁబడని ప్రాణనాథుఁడు మాఁకు లోఁబడునా? ఇందులకు నీవు నన్ను బ్రతిమాలనవసరములేదు. బలిమినో నలిమినో మీరే తోడ్కొని వెళ్లుఁడు.

రుక్మి—చెల్లెలా! నీవు ఎల్లకాలము అనుభవించు సౌఖ్యము. ఒకరోజు గాదె? పూటయుఁగాదె కొన్ని గంటలైననుఁగాదె ఒక్క క్షణము మేము అనుభవింపకూడదా? అట్లులనుభవించుటకు అర్హులముఁగామా? ఇంత నిర్దాక్షిణ్యము—ఇంత నిష్కాపట్య

ము— ఇంత నిరాధారము ఎందైనఁగలదే? ధనములఁగోర లేదే? మేడలఁగోరలేదే, వస్త్రవాహనాదులఁగోరలేదే, అంద రకును ప్రాణధనంబైన ప్రాణేశ్వరుని ఒక్కక్షణము ఈఆనంద సమయమందు—ఈపవిత్రి సమయమందు—ఈనా జన్మదిన సమయమందు మామందిరమునకుఁ బంపుట కంగీకరింపవా? అయ్యో! ఇంతటిసౌఖ్యము మేమనుభవిచుటకు నోచుకొన లేదా?

అనుబంధము. 5.

జాంబ—సత్యా! నీకింతటి యహంభావముకూడదు. జగన్నాధుని పట్టమహిషికి, భర్తృపరతంత్రురాలికి, సర్వకలుషాపకారికి, పతివ్రతాశిరోమణికి ఈపాటి స్వతంత్ర్యములేదా? ఈపాటి ఆనందమునకు తావులేదా? అతిగర్వాంధప్రమత్తహృదయు రాలా! గర్వింపకుము. శీఘ్రకాలములో గర్వభంగము కాను న్నదిలే. లేకున్న నీకిట్టి దురహంకారము పుట్టియుండదు. న్యా యాన్యాయవిచారణసల్పనలదా? బుద్ధిఁదెచ్చుకొనుము.

సత్య—మనోహరా! మాట్లాడరేమి? ఈఆడుపులులనుగాంచితివా? నన్నెట్లు తూలనాడుచున్నారో? నీవి మధురమీాదపిల్లివాటము మాత్రము వదలుము. నాతోవచ్చెదరా? రారా? ఈరెండు ప్రశ్నలకు జవాబొసంగుము. నోరుమెదపరేమి?

వసం—అమ్మా! ఆలోచించుకొననిమ్ము. పాపము రుక్మిణీదేవి ఎంతో భ్రాంతిచే పనిఁగట్టుకొని వచ్చినది.

సత్య—మూఢుఁడా! నోరుమూయుము.

మిత్రి—పతినిఁదన్నిన పతివ్రతాశిరోమణి; వయస్యా! నిన్ను మూఢుఁ డా యనుటకు సందేహించునాయేమి?

నార—(స్వ) భళీ! ఈమిత్రవింద బాగుగనే ప్రత్యుత్తరమిచ్చినది.

కృ—సత్యా! దూరదృష్టి నాలోచింపుము కోపము—పట్టుదలమా త్రము విడిచిపుచ్చుము.

ఉ. ఓతరళాక్షిరోవినుము, మ ♦ హోజ్వల క్రోధమువీడి రుక్మిణీ
పూత చరిత్రనిశ్చయము ♦ ముచ్చటకై యిటు ప్రేమబిల్వనీ
రీతితిరస్కరింప విప ♦ రీతముగాదె? పరిజాతవిస్సనీ
ఖ్యాతికిఁజేటుగాదె ఘన ♦ ఖ్యాతిఁగడింప నెనుగ్రహింపవే॥

అందును ఎన్నఁడు వేడరాని రుక్మిణినేడువచ్చి బ్రతిమాలుచున్న దే? ఏల సమ్మతింప కూడదు?

నార—(స్వ) అతి ప్రణయాంధకారగనిమగ్నులైనవారికి ధర్మాధర్మములు—ఎగ్గుసిగ్గులు—కష్టసుఖములు—దయా దాక్షిణ్యాములు నుండవనుటకీ సత్యాదేవిప్రవర్తనము తార్కాణము.

సత్య—ఏమి నాథా? నీకంతకనికరముగానున్న రుక్మిణి గృహంబునకే గవచ్చును. నాతోనీకుపనియేమిలే? (పోబోవుచున్నది)

కృష్ణ—(వారించి) సత్యా! ఆగుమాగుము ఇంతలోనే కోపముదెచ్చుకొంటివా? వసంతా! ఈవిషయమై నీవేమైనా తీర్పుచెప్పఁగలవటోయి.

వసం—(స్వ) నాయింటిదానిగండము దప్పించుకోఁగలిగితికాని, ఈవిషయములోమాత్రము నాగండము ఫలించుననుమాట వాస్తవము ఉం—నాకేల? మౌనముఁ దాల్చి యూరకొనియెదనుగాక! (మాట్లాడక గుంజ్జుదిప్పుచున్నాఁడు)

సత్య—బ్రాహ్మణోత్తమా! మతిపోయినదా ఏమి?

రుక్మి—వయస్యా! న్యాయన్యాయవిచారణకుగడంగి సరియైన తీర్పుఁజెప్పుము.

కృ—చెలికాఁడా! పలుకవేమి? ఇయ్యది నీ కుశాగ్రబుద్ధికి దూరమైనదావిమి?

శ్లో॥ దైవాధీనం జగత్సర్వం
మంత్రాధీనంతు దైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం
బ్రాహ్మణోమమదేవతా॥

అను ప్రమాణవచనము నీవలన సార్థకముఁగాదా ఏమి?

వసం—మిత్రమా! బ్రాహ్మణబుద్ధికి మించినవస్తువు ప్రపంచమునఁ గలదా? ఇదె చెప్పుచున్నాను ఆలకింపుము. రుక్మిణియింటి...కి

సత్య—ఆ! ఆ! (కండ్లెర్రజేసి వసంతుని పరీక్షించుచున్నది)

వసం—సత్యాదేవి యిం...........

జాంబ—సరిసరి. (వలదని సంజ్ఞచేయుచున్నది)

వసం—ఉం! రెంటికి చెడ్డ రేవడ నైతిని... తగువే లేదు.

కృష్ణు—వయస్యా! నీవంటిభోజన బ్రాహ్మణునకు తగినటులే తీర్పుఁ జెప్పితివోయి.

సత్య—మూఢుఁడా! ఫలానాయని నిరూపించి చెప్పిన గొంతు కోయుదురా? ఏమి?

వసం—(స్వ) నేమతిఁబోయిన వానివలె నటించినఁగాని వీరు నన్ను విడువరు (ప్రకాశముఁగ) చెప్పనా? మీయింటికి—మాయింటికి—రుక్మిణిదేవి యింటికి—అక్కడకు—యిక్కడకు ఎక్కడకో నాకే తెలియదు. పొండు. (గంతులు వేయుచు గిరగిర తిరుగుచున్నాఁడు)

మిత్ర—బ్రాహ్మణోత్తమా! మతిపోయినదా యేమి?

సత్య—సరె! నీ తెలివి తెల్లవారినటులేయున్నదిలే? నాథా! ఈతఁడు మోమాటముచే చెప్పుటకు సందేహపడుచున్నాడు. నాకు ఆలశ్యమౌచున్నయది. నాతో వచ్చెదవా? లేకపోయెదవా?

నారద—(స్వ) నాకిదేసమయము. (కృష్ణు సమీపించి) కృష్ణా! ఇది సవతుల ప్రణయ సంఘటనము కాబోలునే?

కృ—నారదా! నిజము గ్రహించితివోయి! ఇందు విషయములో నా
కొక ధర్మసందేహముఁ దోచుచున్నయది. అయ్యది నీవలన.

సత్య—ఆ! చాలు చాలు! సతీపతుల కలహము ఈనారదుఁడా తీర్చు
వాఁడు. నాకు తగవులతోఁ బనిలేదు. నారదునివంటి
న్యాయాధిపతులతో బనిలేదు. ముఖ్యముగ నీవునాతో వచ్చె
దవా? నన్ను పొమ్మనెదవా?

కృ—సత్యా! సత్యయను నామధేయము రూఢిపఱ్చుకొనవే? శాంత
మువహింపవే ?

సత్య—అబ్బా! మీ యిష్టము వచ్చినచోటకు పొండు మీకు నాతోఁ
బనియేమి? నాఁకు మీతోఁ బనియేమి? రావేనళినీ! (నిష్క్ర
మించుచున్నది)

నార—దేవా! నీధర్మసందేశాంశము సత్యవతీదేవి క్రోధమూర్తిఁ దెల్ప
కయే తెల్పుచున్నయది. నిగ్రహానుగ్రహసమర్థుఁడవు నీకునే
ధర్మతీర్పు చెప్పవలయునా?

గీ. నిత్యగర్విత చిత్తయౌ ♦ సత్యకిప్డు
క్రోధమూరాకపోదు యీ ♦ సాధనమున
మెలత నిర్మలచరిత రు ♦ క్మిణీమనంబు
చిన్నబోవఁగాఁ బోదు వి ♦ శేషముగను.

కావున ధర్మప్రభువులైన వారికి తెలుపవలసిన విశేషాంశములు మరి
కొన్ని కలవా? భగవత్స్వరూపులు భక్తవిధేయులుఁగాని ప్రేమ
విధేయులును భార్యావిధేయులును కారు.

కృ—నారదా! నిజమువచించితివి. సత్య నన్నేమిచేసినను సరియే నే
భక్తవిధేయుఁడనే? వైదర్భి లెమ్ము! నీమందిరమునకే దారి
తీయుము.

రుక్మి—నాథా! ఇప్పుడుగదా నాకు సంతోషము.

కృ—నారదా! నీవును మాకతిధిగా రమ్ము.

వస—ఈవేళ ఏదియో గొప్పగండమే యున్నదిలే?

(అందరు నిష్క్రమింతురు)

నళి—కానిమ్ము! ఇప్పుడు నేఁబోయి సంగతి నంతయు సత్యభామకు విశదీకరించి కృష్ణునిపని పట్టించెదనుఁగాక!

(నిష్క్రమించును.)

తెర వ్రాలును.

---

## 2. వ. రంగము.

---

స్థలకము—సత్యభామ సౌధము.

(సత్యభామానళినులు ప్రవేశింతురు)

సత్య—నళినీ! ఎన్నఁడును గల్గని సంతాపము నేటికి ప్రాణనాథుని తిరస్కృతివలనఁగదా సంభవించితీరినది. ఇంక నేనీదుర్భరవిచారములో నెంతనికాలము గడుపుదునే, ఆమాయలమారి చీలి రుక్మిణి నాథునకేదియో పెట్టి యుండవచ్చును. లేనియెడల నిరంతరమదాజ్ఞాబద్ధకంకణుఁడైన నాథుఁడేల? నేడు మదాజ్ఞనుల్లఘించుటేల? అందును పట్టుదల సమయమందే నన్ను పరాభవింపవలెనా? అక్కటా! ఈనాదుర్భరదుఃఖము తీర్చువారు లేరుగదా! ఆ జ్ఞప్తికివచ్చినది. నళిని! పతివశీకరణౌషధములు ప్రపంచమున గలవట నిజమేనా? అట్టివి సంపాదించి పెట్టి నాకృతజ్ఞత కాస్పదురాలవుకావే నళిని!

గీ. పతివశీకరమంత్రితం ♦ త్రములో లేక
ఘనతరౌషధములుగాని ♦ గల్గియున్న
నరయువే? లేకయున్న హా ♦ లాహలంబు
సరిసంబున త్రాగిత్య ♦ జింతుసుఖము.

నళి—అమ్మా! నీవు హాలాహలము పానముఁజేయునంతటి యవస్థ యేలవచ్చినది? నీనాథుడు నిన్ను విడచి రుక్మిణిగృహంబుననే కాపురము చేయునా? అట్లెన్నటికిని చేయరు. నీవు దుఃఖము మాత్రముమానుము.

సత్య—నళినీ! ఆమాయలమారి ఏదియో చేసి నాథుని వశ్యముఁ జేసుకొన్న దనుమాట కల్లఁగాదు. ఇంతకును ఆజగడాలచీలి నారదుఁడే కారకుఁడో తెలియకున్నయది.

నళి—ఆబ్రహ్మసూతి సమయమునకు రానియెడల నీ నాథుఁడు రుక్మిణిమందిరమునకు దారితీయఁడు

సత్య—నళినీ! ఆనారదముని సహజకలహప్రియ నాటకవిలాసము, మనకత్యంత సంతోషదాయకమేయని చెప్పవలసి యున్నది. మొన్నటి పారిజాతావిటప సంఘటనము నీవు మఱచితివా? యేమి?

నళి—అవును. పారిజాత వృక్షకథావిధానమున నీకత్యంత సంతోష ప్రదంబుగూర్చి, రుక్మిణీ గర్వభంగమునకు కారణభూతుఁడైన వాఁడు నారదుఁడేకదా!

(తెరలో వీణగానము)

సత్య—(ఆలకించి) మాటలోనే ఆకలహాసనుఁడు ప్రవేశించుచున్నటులఁ దోచుచున్నది.

నార—(ప్రవేశించి) అమ్మా! కుశలమా ?

సత్య—నారదా! నమస్కారము.

నార—భర్తృప్రియ సిద్ధిరస్తు.

సత్య—ఆపీఠమునం దయచేయుఁడు.

నార—అమ్మా! నీముఖారవిందమున విన్నదనంబు బొడకట్టుచున్నయది కారణమేమై యుండును.

సత్య—నారదా! అయ్యది నీకు నేఁదెల్పవలయునా? ఏమో నీవును దారితప్పి యిటు విచ్చేసితివని నాసందేహము.

నార—దారి తప్పుటయేమి ?

సత్య—పరమపతివ్రతాశిరోమణి రుక్మిణి గృహంబు నీవంటి మునిపుంగవుల కత్యంత సంతోషప్రదంబుగదా!

నార—అదేమి తల్లీ !

సత్య—నారదా! ఎఱుఁగని వానివలె నడుఁగుచుంటివా? నీవు సహితము అతిథిఁగాఁ బోవలేదా యేమి ?

నార—పోయిన నేమాయె, పిలువని పేరంటమునకు పోవలేదుగద !

సత్య—నారదా! వ్యర్థప్రసంగములతో బనిలేదు. నాకచట సంప్రాప్తించిన పరాభవము వీక్షించితివిగదా! ఆరుక్మిణీదేవి సమస్తము గలది యగుటచే మన్నాథుఁడచటికి పోయెను. నేను అతి దరిద్రురాలనుఁ గాఁబట్టి నాకోర్కెనష్టేట గలసినది.

నార—ఏమి? తల్లీ! నీవిట్లు మనఃసంకోశమునకు లోనై రుక్మిణిని పెద్దజేయుచుంటి వేల?

*సీ. భాసురమణిరత్న ♦ బద్ధసౌధంబులు
మణిహేమ చిత్రిత ♦ మంటపములు
పద్మరాగచ్ఛాయఁ ♦ బరఁగు వేదికలును
వజ్రకవాటముల్ ♦ వసుగృహములు
పవడంపుగడపలు ♦ బహుభూషణంబులు
రత్నాసనంబులు ♦ రాజ్యములును
బట్టుపుట్టంబులు ♦ బాంధుజనంబులు
దాసీజనంబులు ♦ ధాన్యములును

గీ. కనకపవనములాదిగాఁ ♦ గల సమస్త
వస్తుజాలంబులును గల్గి ♦ వశ్యుఁడైన

భర్తయనుగల్గె నీతోడఁ ♦ బడతులందు
సాటియెవ్వరు గలరమ్మ ♦ సారసాక్షి!

సత్య—నీవు వచించినటుల భర్తయే వశ్యుఁడైన నాకీ సంతాపమే యుండదు. నారదా! నాథుఁడు నాయందనురాగము త్యజించి కదా! నలుగురిలో తలవంపులు ఘటింపఁజేసినాఁడు.

నార—మొన్నటి పారిజాతవృక్షంబు కథమఱచితివా? శ్రీకృష్ణుఁడు సత్యభామా విధేయుఁడుఁగాని, రుక్మిణీ విధేయుఁడుఁగాఁడు, సకల వస్తువాహనములుఁగల్గిన నీకు పతివశముగా లేదా?

*చ. అభినవరూపయౌవనము ♦ లంగన కుంగలవేనిఁజాలదు
ర్లభములు రత్నహేమమణి ♦ రాజితభూషణముల్, లభించినన్
విభుఁడు మనోజ్ఞరూపగుణ ♦ విత్తకళానిధియౌట దుర్లభం
బిభపరయాన యట్లయిన ♦ నేమివిధేయుఁడుఁగాకయున్నడన్.

*గీ. ఇన్నియును నీకుగల్గె నీ ♦ వింతదాన
వనుచుఁ బొగడంగవశమటే ♦ యంబుజాక్షి
రుక్మిణికి గల్గెనేని వ ♦ రుండు నీకు
చాయ నెడబాయకుండు వి ♦ ధేయుఁడగునె.

సత్య—నారదా! ఎన్నియున్నను యిప్పటివఱసమాఁడ శ్రీకృష్ణుఁడు రుక్మిణీవిధేయుఁడేకాని, సత్యభామావిధేయుఁడు కాఁడుఁగదా! ఆమాయలమారి యేదియో చేసియుండవచ్చును. నారదా! భర్తనాకు విధేయుడౌటకు ఎద్దియైన వ్రతము కలదేని వచింపుము.

*చ. అనఘ! భవకటాక్షమున ♦ నన్నియుఁగల్గెనునాకు సత్తపో
ధనుడవు సర్వశాస్త్రచర ♦ తత్వవిదుండవుగాన నీవెఱుం
గనివియులేవు సువ్రతము ♦ గారవమొప్పగఁజేయుబుద్ధినా
మనమునఁబుట్టెదెల్పువ స ♦ మానముగా నొనరింతునే వేడ్కతోన్.

నార—(స్వ) ఆహా! ప్రేమయెంతస్వార్థలాభకాంక్షి. ఇఁక నాప్రయత్నము నిజముగ ఫలించునను మాటయే, ఇక నాప్రణయకలహ నాటకము శ్రీకృష్ణతులాభారము నిర్విఘ్నముగ నెరవేరు ననుటతథ్యము. (ప్రకాశముగ) సత్రాజితీదేవీ! అట్టివ్రతరాజము ఒక్కటియేగలదు. దానికి నిష్టపతిసిద్ధివ్రతమనియు బుణ్యకవ్రతమనియు నామధేయములు. పూర్వము అరుంధతి శచి గౌరి మున్నగు పతివ్రతాశిరోమణు లీవ్రతారాజాబు నాచరించి ధనధాన్యములతోసహా పుత్రవతులై భర్తలతోకలహాములు లేక సౌఖ్యము ననుభవించిరని కొన్ని శాస్త్రములు విశదీకరించుచున్నయవి.

సత్య—నారదా! ఇఁకనేధన్యురాలను.

గీ. ధనసమస్తమునించు నా ♦ ధనముప్రాణ
ధనము! పతివశీకరణవ్ర ♦ తంబెకరము
భక్తిమెసల్పిసతము సౌ ♦ భాగ్యసౌఖ్య
మనుభవింతుఁగదయ్య! యో ♦ మౌనిసింహా!

కావున నావ్రతవిధానము జెచ్చెరనెఱింగుము. పరమపతివ్రతాశిరోమణులతో సమానురాలనై ధన్యతగాంచెదను.

నార—సత్యాదేవీ! వినుము. ఒకశుభదినమున

* సీ. తనపతికతిభక్తి ♦ దలఁచుంటిపునుటను
తిలకంబుదిద్ది మా ♦ క్తికకిరీట
ముఖబహుభూషణ ♦ భూషితుఁగాఁజేసి
పొంబట్టుపుట్టముల్ ♦ పొసఁగఁగట్టి
తాను స్నానముచేసి ♦ తగిన భూషణముల
ధరియించిపతికి వం ♦ దనముజేసి
దోసిలినిండుగా ♦ బోసి రత్నంబులు
మూడు ప్రదక్షిణ ♦ ములనుజేసి

గీ. పూజ్యుఁడైనట్టి యొకపుణ్య ♦ భూసురునకు
దక్షిణయొసంగి భర్తను ♦ దానమిచ్చి
మరలి పతిమెత్తు ధనమిచ్చి ♦ మగనిఁగొనిన
నవని నిది యిష్టపతిసిద్ధి ♦ యనువ్రతంబు.

సత్య—నారదా! అటులైన పతిదానము పేరుకొఱకేనా?

నార—అవును, కాని తల్లీ! ధనములు గాని ధనేతరములుఁగాని నీపతితోఁ దూఁగగలవాయనెడు మాట మాత్రము దీర్ఘముగా నాలోచింపుము.

సత్య—ఏమి? నారదా! నాధనకనకవస్తువాహనములతో పతినితూచు కొనలేనా? ఒక్క కృష్ణునికాదే పదివేల కృష్ణులను తూచ వచ్చును. నాజనకుఁడొసంగిన శమంతకమణి ఒక్కటిచాలదే?

నార—ఇక సందేహమేలకాని, భర్తృదానము నెవ్వరికొసంగెదవో యోచించుకొనుము.

సత్య—నారదా! భక్తాగ్రేసరులును, బ్రహ్మ ఋషులును, సర్వలక్షణ సద్గుణ సంపన్నులును అయిన నీకన్న నితరులు నీదానమునకు అర్హులవుదురా?

క. శ్రోత్రియుఁడవు పరిజితష
ట్ఛాత్రవవైభవుఁడ వమల ♦ చారిత్రుఁడ వి
ద్ధాత్రిని నీదానమునకుఁ
బాత్రులు నీకన్నఁగలరె ♦ భవ్యచరిత్రా!

నార—అటులైన! నేధన్యుఁడను. మఱిదితిని పారిజాత వృక్షంబును సహితము కృష్ణునితో సహా దానమొనర్పవలయును సుమా?

సత్య—పరమానందముగ నొసగుదాన నారదా! ఈవ్రతమునకు శుభదినం బెప్పుడో యోచనతెండు.

నార—రేపటిదినమే శుభము కావున నట్లాచరింపుము. పతిని దూయ గల ధన మున్నయెడల నీపీవ్రతంబునకు గడంగుము. లేని యెడల బహుకష్టములకు లోనగుదువు సరికదా! మీదుమిక్కిలి గర్వభంగము కూడ సిద్ధించును సుమా?

సత్య—నారదా! ఈవ్రతాచరణముచే పతి నావశీకారమౌననియా యేమి? నీవిచిత్రపుమాటలు. ఒక్క శమంతకమణి యొసంగు ధనముతోనే నానాథుని తూచుకొనుదానను. నీహాస్యవచన ములకేమిగాని రేపుతప్పక నాగృహంబునకు వచ్చెదవా?

నార—అమ్మా! తప్పకవచ్చువాఁడను. ఇందు విషయమై నీపతియాజ్ఞ కూడ బడయుదును. ఇక నేఁబోయివచ్చెదను.

(నిష్క్రమించుచున్నాడు.)

సత్య—నళినీ! ఇఁక మనకోరిక గట్టెక్కినట్లేసుమా? (కొన్నివస్తువు లనుతీసి) నళినీ! ఈనగలను భద్రపరచుము. ఇంక నేకోపస్వ భావురాలనై కృష్ణునెటులైనను నీవ్రతదానమునకు పాత్రుని జేసి తీరవలయును. నీవు ద్వారమువద్దకేగి వసంతునిగాని కృ ష్ణునిగాని రానీయక కొంచెము గడుసుతనము గనపర్చుము సుమా?

నళి—మంచిది.

సత్య—(నిష్క్రమించుచున్నది.)

నళి—(ద్వారమువద్ద కాచియుండును.)

(అప్పుడు కృష్ణుడు ముందును వసంతుడు వెనుకను ప్రవేశింతురు.)

వసం—(పొట్టతడుముకొనుచు) వయస్యా! వయస్యా! కొంచెము న మ్మదిగా నడువవయ్యా! రుక్మిణీదేవిపెట్టిన బూరెలు గారెలు పూర్తిగా పొట్టలో బ్రవేశించి నన్నతికష్టముల పాలుజేయు చున్నవి.

కృ—మిత్రమా! కొంచెము లోసరిపెట్టలేకపోతివావమి?

వసం—బాగుగనే యున్నది. ఈవేళ ప్రాప్తించినసమయము మరొక రోజున ప్రాప్తించునా?

కృ—వసంతా! లెస్సగా వచించితివి. (నళినినిగాంచి) మిత్రమా! అల్లదే సత్య మనలనులోనికి ప్రవేశింపకుండ నళినిని ద్వారమునవద్ద నెటుల నియమింపజేసినది కంటివా?

వసం—నళిని నెటులైనను మాయలోబడగొట్టి ప్రయత్నింతును. ఆ సమయమున నీవు మెల్లగ లోనఁ బ్రవేశింపుము. మిత్రమా! ఈసారి సత్యాదేవిపాదములవైపునగాక! తలవైపున నిలువబడి మరి మాట్లాడుము.

కృ—(నవ్వుచు) వసంతా. ఇక నీవేళాకోళపు ప్రసంగములు చాలించుము. నీహాస్యరసప్రవాహమున నళిని నోలలాడింపజేయుము. నేను తెలియకుండ లోనప్రవేశించెదను.

వసం—సరే! (నళినినిసమీపించి) నళిని! ఇక నేమున్నదే? కృష్ణుడు వచ్చుననియా ద్వారమునద్ద వేచియుంటివి. చాలు చాలు "నావంటి వెఱ్ఱిబ్రాహ్మణుడు బిక్షకుపోగా వారములేని రోజున రావయ్యా! వందరూప్యముల దక్షిణయిస్తానన్నాడట. ఒక లోభి అందుల కాబ్రాహ్మణుడు వారములేని దినమెప్పుడురాయని దినముల లెక్కపెట్టడము మొదలుపెట్టాడట." ఎందుల కీయవస్త. ఆవెఱ్ఱిబ్రాహ్మణునిమించినవెఱ్ఱినళినివిగానున్నావే?

నళి—ఏమయినదియేమి? వయస్యా! (వసంతుని సమీపించుచు.)

కృ—(మెల్లగాలోనఁ బ్రవేశించుచు.)

వసం—ఈవేళ సత్యాదేవి మెట్టినదినమునకు పప్పుదప్పళములు విస్తారముగ సిద్ధపరచినారు కాబోలునే.

నళి—బాగుబాగు! ఇదియూ నీయాలోచన. పప్పుదప్పళములు కావు కాని, మెట్టినదినమని దిట్టముగ మొట్టికాయ పచ్చళ్లుమాత్రి

ము ప్రత్యేకముగ మీ మిత్రుల కిరువురకు సిద్ధము జేసినమాట తథ్యము.

వసం—నీశిగతరగ. నీసౌకరీతనమునకు భంగముప్రాప్తించినదిలే?

నళి—ఏమీ! ఎంతమాయఁజేసితివి (లోనబ్రవేశించును)

వసం—(నవ్వుచు) ఈవెధవసౌకరీ బ్రాహ్మణ ప్రయత్న భంగము జేయునే? ఏది యెటులున్నను కృష్ణునకు మాత్రము తన్నులు ప్రాప్తించకుండుగాకయని వెయ్యిదేవతలకునాప్రార్థన (నిష్క్రమించుచున్నాడు)

(రామావధాన్లు—వెంకటావధాన్లు ప్రవేశింతురు)

రామా—సత్యాదేవికీదినము పెట్టినదినమటోయి నీవువిన్నావా?

వెంక—నేనును వీధిలో ఎవరో అనుకుంటుంటే విన్నానయ్యా!

నళి—(పునఃప్రవేశము) ఎవరుమీరు?

రామా—మేము బ్రాహ్మణులము.

నళి—అటులైన పోవచ్చును. రుక్మిణి జన్మదినోత్సవమట!

రామా—నేడు సత్యభామాదేవిగారి మెట్టినదినమట కాదూ?

నళి—మెట్టినదినముగాదు కృష్ణవసంతుల మొట్టికాయల దినము. ఇకపోవచ్చును.

(అందరు నిష్క్రమింతురు)

తెరవ్రాలును.

## 3. వ. రంగము.

---

సత్యభామ—సౌధము.

(సత్యభామను బ్రతిమాలుచు కృష్ణుఁడు ప్రవేశము)

—సత్యా! ఇదేటికోపమే? నాపేరనుపరివాహాన్నిజము భావంబున గ్రహించియు, గ్రహించనిదానివలె నటించి నీయాగ్రహము వృద్ధిగావింప జేసెదవేల?

అనుబంధము 6.

ఉ. పారిజపత్రనేత్రవిను ♦ వైరమదేటికి రుక్మిణీసతీ
కోరికవ్యర్థపుచ్చుటది ♦ కూడదటంచు మదిన్ తలంచి యే
నూరకపోయి రెండుమెతు ♦ కుల్దిని శీఘ్రముగ తిన్ త్వదీయశృం
గారగృహంబుజేరితి ని ♦ కన్ కరుణింపవె యాదరింపవే.

మాటాడవేమి? మగువా! ఈస్వల్పవ్యాజంబున నీకింతటి క్రోధమావేశమౌనని దలంపనైతినిగదే. ఏదీ? నీశృంగారచిలుకపలుకుల నాయలమటదీర్పవే. సహజకోమలశరీరసంజనితురాలవు నీకీ మాధ్యము నీకిట్టి యాగ్రహముకూడదు. అయ్యో! పలుకవేమి? నీయీక్రోధకారణము నారుక్మిణీగృహప్రవేశమేనా? అట్లైన దాసునితప్పిదము దండముతోసరి.

గీ. "తప్పులవియున్న దాసుని ♦ దండమున నె"
నరియటందురు బుదె నమ ♦ స్కారమతివ!
తప్పులుండిన నాయెడ ♦ దయదలంచి
మధురసరసోక్తులాడవే ♦ మానితముగ.

సత్య—ఏమీ? ప్రణయైకవంచకా! పరాభవప్రతిఫలము చాలలేదని యా, యింకను ఈనయగారపుమాటలు. చాలులే? అయ్యో, ఈకలుషాత్మురాలి పాదు గృహమున నడుగుపెట్టితిరా? పలుకు

వలదు. పరమపతివ్రతాశిరోమణి రుక్మిణీగృహంబు నీవంటివా
నికి పవిత్రసౌఖ్యప్రదంబుగదా? దయచేయుము. ఈకుటిలగమ
న మందిరము కష్టప్రదంబు కదలరేమి?

కృ—సత్యా! కోపముదిగమ్రింగుము.

చ. నిరతము సత్యభామయనె ను ♦ దీయసతీనివహంబులో మహా
పరమ పతివ్రతామణియ ♦ పారదయానిధియంచు నమ్మి నీ
సరసమెగోరి యున్న కను ♦ సాహసివై పతిఁదూలనాడి యీ
కరణిజరించుటేటి ఘన ♦ కార్యము దెల్పవె మానినీమణీ.

సత్య—అబ్బా! నీయపారకరుణాకటాక్షము యీసత్యభామపై జూప
నేల? ఈనీయనుగ్రహ ప్రవాహముచేతనే నాకీ పరాభవము
సంభవించినది.

గీ. పట్టుదలవచ్చినప్పుడి ♦ ప్పగిదిగట్టి
పట్టుదలపట్టి గొనిపోయె ♦ దిట్టగనుక
కట్టకడకిట్టి చెట్టలే ♦ పట్టినాకు
ఎట్టులోర్తు పరాభవ ♦ మెటుసహింతు.

నళినీ! ఈపరాభవముచే నెంతకాలము బ్రతుకుదునే? ఏదీ?
ఇంతక్రితము నీకొసంగిన విషమిటు తేవే? (వెడలబోవుచున్నది)

కృ—అయ్యో! నాప్రాణధనంబు నీవు పోయిన నాకు గతిగలదే?
సత్రాజితీదేవీ! నిన్ను ప్రార్థింతును. ఈస్వల్పవ్యాజము మన్నిం
చి నీచిలుకపలుకల నన్నానందింపజేయుము. (చేయి పట్టుకొను
చున్నాడు)

సత్య—నాథా! నన్ను విడువుము. యిక సౌఖ్యమునకు నాకీలోకమున
తావులేదు విషపానముజేసి పరలోక సుఖంబును గాంతును.

గీ. పతియె దైవమటంచు నె ♦ మ్మది దలంచి
భక్తిమై సేవసల్పితి ♦ ముక్తికొఱకు

కలియె సతికష్టములకు బా ♦ ల్పుచునుండ
సతికి గతియొందగలదు నీ ♦ క్షితితలమున.

కృ—సత్యా! ఇదేమిపట్టుదల వదలకుంటివి. పుట్టినదిరంబది రుక్మిణి బ్రితిమాలరాగా నీకేల కనికారము పుట్టగూడదు. అందులకు నేఁబోయిన నయ్యది నీకు పరాభవమయ్యెనా? ఎంతచిత్ర మెంతచిత్రము. ఇదిగో యీనీయాజ్ఞమీరి నెచ్చటికైన పోయిన నిజముగా నీవొసంగు శిక్షకు పాత్రుఁడనయ్యెద. ఈఅపరాధము క్షమించి నీసహజ శృంగార వాక్సుధారసంబుచే నామనఃవేదన చల్లార్చుము.

అనుబంధము 7.

సత్య—నాథా! వెఱ్ఱి సత్యభామను మోసముజేయు పన్నుగడలా యివి?

మ. ఇకనీయానతిదాటనంచునను నె ♦ న్నేమార్లు నమ్మించి పా
యక నాతోడి సతీగృహంబులనె ని ♦ త్యానందమేగాంచి, తా
వకగంభీరవచోక్తులందుగల భా ♦ వంబెల్ల జూపింపవే?
యికనీమాటలయందు సత్యముది యిం ♦ తేచాలు పాపేశ్వరా!

కృ—ప్రియా! నాకునీయందలి ప్రేమమగణ్యము అనిర్వాచ్యము, అఖండము, సంశయమేల? యికనీ కోపగృహము శాంతగృహంబుగా మార్చుము. ఈమలిన వస్త్రములేల?—నీవిట్లు అలంకార రహితవై యుండుట కూడను. నమ్మవా? నామాటనమ్మవా? నాప్రేమసముద్రము నిజముగా నీపైననే ప్రవహించుచున్నయది. ఇందులకు నాయంతరాత్మయె సాక్షి. వెండియు వలపులహృదయమైకసాక్షి. [illegible]లెమ్మునసర్వాలంకారభూషితవై సహజప్రణయైక హృదయురాలవై నాడెందంబున కమందముదంబు ఘటింపజేయుము.

సీ. శాంతింపవే నిత్య ♦ శాంత్యైకహృదయసం
తతసత్యసువ్రతా ♦ పతితనీవు
కృపగాంచవే భూరి ♦ కృపమైకస్వాంత వి
శ్రుతభాగ్యసంతతా ♦ దృష్టనీవు
ధర్మంబ దెంచవే ♦ ధర్మైకచిత్తయ
నన్య సద్గుణాగణా ♦ గణ్యనీవు
సరసోక్తులాడవే ♦ సరసైకహృదయ స
మ్యాగ్నితసహజ ప్రి ♦ సూననీవు
గీ. గురుతరాగ్రహ మేలనే ♦ కోమలాంగి
పరిభవంబది నీకేల ♦ భాసురాంగి
అసువులను నీవు బాయుటే ♦ లన లతాంగి
సంతసము బూనవేమది ♦ సారసాంగి.

సత్య—నాధా! ఇదియంతయు నిజమేయైన నాకు సంతోషము కాని
పరాభవము చల్లారు విధానమెద్దియో వచింపుము.

వసం—(ప్రవేశించి) ఈసత్యభామకింకను కోపము దూరముకాలేన
టుల దోచుచున్నయది.

కృ—ఏమీ?

గీ. సతము నీమహృదయ ♦ సందేహముల నీర్చి
వరము లొసగివేడ్రమ ♦ నరయుచుండ
కినుకబూనదేల ♦ వినవేల మమ్ములు ప
రాభవంబదేమి ♦ రామనీకు.

ఎన్నడైన నీకు వరముల తక్కువజేసితినా? ఎయ్యదికోరినను వ్యర్థపు
చ్చక సంపూర్ణహర్షముతో నొసంగుచుండ నీకీ ఆగ్రహమేల?
స్వల్పవ్యాజంబున నిటులే నీకు మహోపకారము సేయుట

లేదా? మొన్న పారిజాతాప్రసూనరాజవ్యాజంబున నీకుసల్పి
నమేలు మఱచియుంటివా?

వసం—(స్వ) మిత్రునితోసహితము నన్నుగూడ నిందించునేమోగదా!
సత్యనిత్యకోపదారి! లేనియెడల పతియింతగా బ్రతిమాలుచుం
డ కరుణారసము సూన్యము సల్పినది. యింతటినిర్దయ, నిష్కా
పట్యము నిరాదారము ఎందైనగలదా?

సత్య—(తనలో) ఇంతకిప్రతము నారదు డుపదేశించిన వ్రతదానము
నడుగుట కిదియే మంచిసమయము. (ప్రకాశముగ) నాధా!
అట్లైన నాకొకచిన్నవరమునందు గాఢానురాగము గలిగి
యున్నది.

గీ. నాధ! మీచెట్టబట్టిన ♦ నాటనుండి
కోరికలు సమకూరె నే ♦ గోరినట్లు
మనవియొక్కటి కలదయ్య ♦ మాన్యచరిత
చిత్తముననుంచి యదివిన్వ ♦ సింపవలయు.

కృ—దేవీ! నీకేమిగావలయును. ధనములా, ధాన్యములా, రత్నములా
మణులా, సౌధములా, కోరుము నిస్సందేహముగ నొసంగెదను

సత్య—మనోహరా! నేనడిగెడువరము, మణులు కావలయుననికాదు
రత్నములుకాదు, ధనధాన్యాదులుకాదు. ఎద్దియందురేని?

చ. సురమునివచ్చిప్రేమనొక ♦ సువ్రతమానతియిచ్చెనాకు భా
సురముగ నావ్రతంబు మధు ♦ సూదన సల్పెడిబుద్ధిగల్గె నా
దరమున నావ్రతంబు సుప ♦ థంబుగ సాంగముగాగజేయవే
తరుణీతలంపుదీర్పగ వి ♦ ధాయకమాగద భర్తకెన్నిటన్.

కృ—దేవీ! నారదమహాముని సర్వశాస్త్రతత్వజ్ఞుండను త్రికాలవేది
యుం గావున నమ్మహాత్ము డానతిచ్చినవ్రతంబు నీకవశ్యకర్త
వ్యమేసుమా?

వసం—(స్వ) ఆ! సమీపించినది. పాపము సత్యాదేవికి సరియైన గర్వ భంగము లేకున్న నాజగడాలచీరి నారదుడేమి? ఈమహాస్వాధినివ్రతముసల్పుమను టేమి?

సత్య—నాధా! ఆవ్రతమునకు ముఖ్యమైన నియామకమొంకటుగలదు. అయ్యది మీవలన నెరవేరవలయును.

కృ—తరుణీ! నీకాసంశయమువలదు చెప్పర నానియామకమెద్దియో వచింపుము. నావలననైనను కాకపోయినను తప్పక వ్రత నియామకము దీర్చెదను.

సత్య—ప్రాణసఖా!

క. చతురానవాంగ సంభవు
డతిమోదముతోడఁ జెప్పె ♦ నార్తశరణ్యా
పతిదానంబిమ్మని స
మ్మతిపడి దానికిని మీరు ♦ మన్నింపవలెన్.

కృ—సత్యా! నన్నేమి? దానమొసంగుటయేమి? ఇయ్యది బహు చిత్రవ్రతముఁగా నున్నదే? బాగు బాగు నన్నేమహామునీయునకు దానమొసంగెదవు. పురుషునకా లేక నీవంటినారీరత్నమునకా?

వసం—(స్వగ) నావంటి వానికి దానమిచ్చిన తప్పక నీళ్లబిందెల మోత సత్యము. నాభార్యావంటి పతివ్రతా శిరోమణి కొసంగిన చీపురకట్ట ప్రహారములు తప్పవు.

రుక్మి—ప్రాణేశ్వరా! ఎవ్వరికో యీదానమని భయపడుచుంటిరా? ఏమహాభాగవతోత్తముఁడు సర్వకాల సర్వావస్థలయందును మిమ్ము గొనియాడుచు ఆనందించునో ఆనారదమునీందునకే.

వసం—(స్వ) బాగున్నది. ఆజడదారి తుంబురదాల్చి "భజగోవిందా" యని బయలు దేరును. ఈ కృష్ణునకు మాత్రము నంచి భుజమున వ్రేలాడుచుండుట నిజము.

కృ—సత్యా! నారదునకు నన్ను దాన మొసంగెదవా? ఆజడదారి సేవ నన్ను నిరంతరము సేయుమనెదవా? ఆకలహాసనుఁడు నన్నేమి సేయునో కదా?

సీ. అచలమా పట్టువ ♦ స్త్రములు కూడవటంచు
కాషాయిగుడ్డలే ♦ కట్టుమనునో?
రమ్యమా ఘనరత్న ♦ రాజదండలు మాని
కక్షపాలలె మెడఁ ♦ గట్టుమనునో?
కస్తూరికాతిల ♦ కమ్మునే చెఱపించి
పెద్దనామంబులే ♦ పెట్టుమనునో?
సకల శృంగారాది ♦ చైదము ల్విడనాడి
మానివ్రతమె మది ♦ బూనమనునో?

గీ. వెండి ఘనగృహవాసము ♦ ల్విడచి ఘోర
కాననంబుల వాసమే ♦ గడపు మనునో?
అతివరో! త్రిలోకముల వి ♦ హారికేల?
వశమునను జేయుటేల? యీ ♦ వ్రతమదేల?

సత్య—నాథా! అట్లు నారదునకు మిమ్ము దాస్యము సల్పనిత్తునా? నారదునితో త్రిలోక విహారముల జేయ నిత్తునా? ఒక్కక్షణమైనను మిమ్ము విడచి నేనుండగలనా? పతి బరువు ధనము నారదునకొసంగి మరల పతిని గ్రహింతు నచ్చునని వ్రతనియామకము కావున,

చ. అనఘ చరిత్ర! మీకరుణ ♦ నంతము లేని ధనంబుఁ గల్గెనా
ఘనునకు దానమిచ్చి తిరు ♦ గన్ మిము దత్తుణ మేను గొందు నా
తనికి భవత్స్వమానమును ♦ ద్రవ్యమొసంగి కృపాలవాల! నీ
మనమున నున్న సందియము ♦ మానుము నమ్ముము నమ్మి నన్నిల్లోఁగా

కృ—(స్వ) నారదప్రయత్నము భంగముగాకుండ యిప్పుడు నేనీ కర్తవ్యమునకై సమ్మతించెదనుగాక! (ప్రకాశముగ) సత్యా! ఇందులకు నాకు సమ్మతమేకాని, నన్నుఁదూయఁగలధనము నీసన్నిధి నున్నదియు లేనిదియూ దీర్ఘదృష్టి నాలోచింపుము. లేనియెడల నిరంతరము నేనాకలహాసనునకు దాస్యముఁసల్ప వలసియుండును.

వసం—(స్వ) తప్పక సత్యాదేవి గర్వభంగమునకే కాఁబోలును ఆక లహప్రియుడిట్టి పవిత్రవ్రతోపదేశము జేసిపోయెను. పరమ సాధ్వీశిరోమణులు చేయవలసిన వ్రతమేమి? ఈసత్యాదేవి సల్పుటేమి? (ప్రకా) అమ్మా! నీధనముతో గృష్ణుఁడు తూ గనియెడల మాయింటియాపెకు దబ్బారేకునష్టాణమున్నది. నీ కది తప్పక సహాయము జేసెదను.

సత్య—నాధా! త్రాసున నిన్ను తూయుటకు ఒక్కశమంతక మణియొసంగు ధనము చాలదే? భయోత్పాతముమానుఁడు. నారదునివలె నాధనకనకవస్తువాహనముల గ్రహింపలేకపో తిరా? సంశయింపకుఁడు.

కృ—దేవీ! అటులైన సమ్మతమే?

సత్య—నాధా! ఈయూరియందుఁగల బ్రాహ్మణులను బిలుచుటకు నెవరినిఁ బంపుదము.

కృ—మనవసంతకుని నియమింతము. వయస్యా! సత్వరమునీవేగి వ్రత విధానము—భర్తృదానము ప్రవచింపకయే రేపటి దినము వ్రతమని బ్రాహ్మణులను బిలిదికొనిరమ్ము.

వసం—శీఘ్రగతి బిలచుకొనివచ్చెదను. (పోవుచు) వహ్వా! రేపటి దినము నాకు ఘనమైన సంభావనలు—పప్పుదప్పళములు— గారెలు బూరెలు తప్పవు (నిష్క్రమించుచున్నాడు)

కృ—సత్యా! ఈవ్రతమునకు బంధువర్గము నాహ్వానింతువా?

సత్య—దేవా! నీతలిదండ్రులు నన్నదమ్ములు సపత్నులు మొదలైన వారు వచ్చిన వ్రతభంగమౌను కావున వారల నాహ్వానింపఁ దలంచలేదు.

కృ—అవును! వారు వచ్చిన నీదానమునకు ఆటంకముకూడ తటస్థించును. సఖీ! యిక నీసందేహము సర్వము రేపటితో విచ్చిన్న మౌట నిజమేనా?

సత్య—నాథా! నాసందేహము నిర్మూలమౌటయె కాక మీదు మిక్కిలి మహాసతీమ తల్లులతో సమానురాలనై ప్రపంచ ప్రఖ్యాతిఁ గడించి ధన్యురాలనయ్యెదను రండు లోనికిఁ బోవుదము.

కృ—(స్వగ) ఈసత్యాదేవి భక్తియందున్న ప్రభావము రుక్మిణీదేవి తులసి పత్రముతో దెలిసికొనఁగలదు. (ప్రకాశముఁగ) సత్యా! నీవు ఎంత ధన్యురాలవే.

గీ. భువి మహాసతీమణులకే ♦ భూరికష్ట
మైన వ్రతరాజమునె సల్ప ♦ నాత్మదలచి
తహహా! నీవ్రతమే సఫ ♦ లంబెయైన
వంచిత సుకీర్తి నీకుల ♦ భించుమగువ!

సత్య—నాథా! తావక కృపావృష్టి నాపై జిల్కిన అటులే సత్కీర్తిఁ గాంచెదను. రండు పోవుదము.

(నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.



శ్రీరస్తు.

# శ్రీకృష్ణ తులాభారము

అను

# తులసీమాహాత్మ్యము.



## తృతీయాంకము.



ఒకవీధి.

(రామావదాన్లు, వెంకటదీక్షితులు ప్రవేశింతురు.)

రామా — దీక్షితులుగారూ! ఈవేళకూడ మన పుణ్యముపండినదన్న మాట వాస్తవము. మొన్న రుక్మిణీదేవిగారి పవిత్రజన్మదినోత్సవమున దొరికిన సంభావనలు అంతులేవన్నమాటయే-నేననేకచోట్ల వివాహములు, వ్రతములు, పూజలు, పురస్కారములు, తద్దినములు, మొదలైనవి చేయించితిగాని ఎచ్చటయు నంతటి భూరి సంభావనలుగాని నంతటి వైభవముగాని దొరకియుండలేదు. కండ్లారాగాంచలేదు.

వెంక — అవదాన్లుగారూ! రుక్మిణీదేవిగారి పుట్టినదినమునకు లభించిన సంభావనలు తథ్యమేగాని, నేడు వసంతునిమాటలు నిజమేనా? లేక తన హాస్యరసప్రవాహమున నోలలాడించుటకా?

రామా — ఎంతవెర్రివాఁడవోయీ! వ్రతములేనిదే "ఈవేళ మాసత్యాభామాదేవిగారి గృహమున పవిత్రమైనవ్రతము. భూరిసంభావనలు తప్పక దయచేయండి" అని బ్రతిమాలివెళ్ళునా? వ్రతనియమము సత్యమనియే నానమ్మకము.

వెంక—సత్యమేనైన వ్రతమేదైనదియు చెప్పవయ్యా అని ఎంత్ర బతిమాలిన చెప్పకుండపోయెను. కారణమేమైయుండును. అందును ఆవ్రతమున కుపక్రమించు మార్గము మఱచియుంటివయా!

రామా—అదియా నీసందేహము. నేను మంత్రము పఠించుచూయుంటె నాతోనే పఠించుచూ యున్నట్లు ఏదో నుతమాట అందుకుంటూయుండవయ్యా! ఇంతమాత్రమునకు నీవు భయపడనేల? అందును ఆగందరగోడవలో మనతప్పు బట్టుకొను విద్యావంతు లెవరుందురూ.

వెంక—అట్లైన సరేనండి. వేళమించిన వ్రతభంగముకూడ గల్గును.

(నిష్క్రమింతురు.)

---

2 వ రంగము.

---

స్థలము—సత్యభామ శుద్ధాంతము.

[శ్రీకృష్ణుడు పట్టవస్త్రములఁదాల్చి కూర్చొనియుండ వసంతుడు ప్రవేశించుచున్నాడు.]

కృ—మిత్రమా! బ్రాహ్మణులను బిలిచితివా? వ్రతవిధానము—భర్తృదానము తులాభారమును గూర్చి నెవ్వరితోనైన జెప్పియుంటివా ?

వసం—వయస్యా! వ్రతవిధానముఁగూర్చి నెవ్వరితో వచింపలేదు కాని, (సంశయించుచున్నాడు)

కృ—సందేహించెద వేల ?

వసం—సందేహించుటకేమిగాని, మిత్రమా! ఈవేళ ఎందరివద్ద నెన్ని మృషావాక్యము లాడితినో నాకేజ్ఞప్తియ దులేదు. కాని నా మృషావాక్యము మాయింటియావి కంటిచూపుతో స్వర్ణమై తథ్యమై తీరినది.

కృ—వయస్యా! నీహాస్యరస ప్రవాహామునకు నీభార్యయే అడ్డు తగలెనా?

వసం—బాగుగనేయున్నది. నొక్కి నొక్కి యడిగి నిక్కువము వక్కాణింపకున్న నీకష్టము నున్నటన్న నాహాస్యరసమువిరమింతునా? ఆ అల్లరి సమయమున నాకల్లబొల్లు హాస్యపలుకులెల్ల మెల్లన చాలింపకున్న భోజనరహితమేగాక భూరి ప్రహారములుకూడ సంప్రాప్తమౌనని నిజంబుచెప్పక తప్పినదికాదు. అందులకు తానుకూడ నిష్టపతి సిద్ధివ్రతము తప్పక జేతునని గట్టిపట్టుబట్టుటయేగాక, బ్రాహ్మణులను తక్షణమే తోడ్కొని రావల సినదని నాకాజ్ఞఅయినది.

కృ—వయస్యా! నిజమేనా? లేక నీహాస్యచమత్కారమా?

వసం—కృష్ణా! నిజముగాక మృష యూయేమి? మీ సత్యభామాదేవి గారి కంటె మాయింటిది మరి పదియాకు లెక్కువ చదివినదే గాని, తక్కువ చదువలేదు.

కృ—మిత్రమా! అందులకు నీవు సమ్మతించితివా? లేదా?

వసం—ఎటుల సమ్మతింతును. నన్నెవరికైన దానమిచ్చిన యెడల నాసాధ్వీశిరోమణి పతియెత్తు పైకము నొసంగి పతిని తిరిగి గ్రహించునా యేమి? పేరూ వూరులేని పాడుపెనిమిటి నాకేలనని యూరకొన్న నాకు సేవకావృత్తి సత్యమేగదా? అందులకుభయపడి బ్రాహ్మణమిషచే యిచటకు సత్వరమే తెంచితిని.

కృ—మంచిపని చేసితివికాదోయి మిత్రమా! దానికేమిగాని, నీభార్య మనగుట్టు బట్టబయలుసేయదుగద!

వసం—వయస్యా! వంగివంగి సలాములు జేసినప్పటికిని నూరకొన్న దియాయేమి? లోకమునైనను మూయవచ్చునుగాని మాయింటియాపెనోరుమూయుట కష్టమే? ఎదరింటి వంకాయమ్మతో చెప్పఁడముగా కుండ, నంకాయమ్మగాదు బొంకాయమ్మగాదు ఎల్లరకు విశదముజేసియున్నది.

కృ—పోనిమ్మకాని, వసంతా! నీవు లోనికిబోయి సర్వము సిద్ధముజేయింపుము. అదిగో నారదుండిక్కడ ప్రవేశించుచున్నాఁడు.

వసం—మంచిది మీరును త్వరగా రండు—బ్రాహ్మణులెల్లరు విచ్చేసియున్నారు.

(నిష్క్రమించుచున్నాఁడు)

(అప్పుఁడు నారదుడు ప్రవేశించును)

నార—(కృష్ణునకు సాష్టాంగ నమస్కారములాచరించి చేతులుజోడించి) దేవాదిదేవా! నారాయణా! నీమహామహిమలెవ్వరును నెఱుంగ నర్హులుకారు. బ్రహ్మేంద్రాదులుసహితము భవదీయ మాయానాటకము గ్రహింపలేనప్పుఁడు, నీమాయదెలియ నేనెంతవాఁడను.

*సీ. జగదీశ! యోగీశ! ♦ సర్వభూతాధార!
సకలసంపూర్ణ! యీ ♦ శ్వరమహాత్మ!
కాష్ఠగతజ్యోతి ♦ కైవడి నిఖలభూ
తములందు నొకడవై ♦ తనరుదీవు
సద్బాధుఁడవు గుహా ♦ శయుఁడవు సాక్షివి
నీయంతవాఁడవై ♦ నీవుమాయఁ
గూడి కల్పింతువు ♦ గుణములవానిచేఁ
బుట్టించి రక్షించి ♦ పొలియఁజేయు

గీ. దీపప్రపంచమెల్ల ♦ నిట్టి నీవిప్పుడు
రాజమూర్తులైన ♦ రాక్షసులను
సంహరించిభూమి ♦ చక్రంబు రక్షింప
నవతరించినాడ ♦ వయ్యకృష్ణ!

కృష్ణా! శ్రీమన్నారాయణుఁడవై లీలామానుష విగ్రహుండవై జన్మించి సకల రాక్షస సంహారంబు గావించి నేడీ జగత్కల్యాణ నాటకము నాడింపజేసెడి సూత్రధారివి నీవుకావా? మహాత్మా! ఈవిధముగనే నిదివరకు సప్తావతారములుదాల్చి జగత్కల్యాణ ము గావింపజేసిన ఆదినారాయణమూర్తివి నీవుగావా?

ఉ. వేదములెల్ల దొంగిలియు ♦ వేగముగా జలరాసిదూరియుఁ
ఖేదముతోడదాగి కడుఁ ♦ గేరుచునుండెడిసోమకాసురున్
రోదనజేయఁగూల్చి పటు ♦ రోషమునన్ పరమేష్ఠిఁజేరియా
వేదములిచ్చిబ్రోవవె భు ♦ విఁ ఘన "మత్స్యవిరాట్స్వరూపివై"

ఉ. మందరశైలముంగదిపి ♦ మాటికిఁగవ్వముఁజేసి వాసుకిఁ
బంధనచేధరాధరము ♦ బట్టి సురాసురులెల్లరుఁ శ్రమం
బొందగ క్షీరసాగరముఁ ♦ బోరి మధించుతరిఁ మహాగిరిన్
కందుకమట్లులెత్తి ధర ♦ గావవె "కూర్మవిరూపధారివై"

మ. ధరణిఁ జాపగఁజుట్టి సాగరమును ♦ దృగ్దీప్తిచే డాయుము
ష్కరుఁడా దానవహేమలోచనుని రో ♦ షంబొప్ప రౌద్రంబుతో
నురముఁ గొమ్మునవ్రచ్చి చీల్చి ధరణి ♦ యుద్వేగముందీర్చి సా
దరణఁ జూపితిగాదె శ్రీపతి! జగ ♦ ద్రక్షా! "వరాహాకృతిన్"

మ. హరిపేరెత్తెకుమారు డంచతనితో ♦ న శ్రాంతముఁ బోరుచుఁ
బరిమార్పఁ హరినెందుదాగె ననుచుం ♦ ప్రహ్లాదభక్తున్నిరా
దరుడైదండనఁజేయ విశ్రుతసభా ♦ స్తంభంబునఁ బుట్టియా
సురవిద్వేషిని హేమకశ్యపుని బల్ ♦ శూరుండవై వేగమే
"నరసింహాకృతి"దాల్చి చంపవెరమా ♦ నాథా! జగద్రక్షకా!

ఉ. దీనతతోడ భూసుర సుదీ ♦ జనులందున "యాచకాకృతిఁ"
దానమునిమ్మటంచడిగి ♦ ధార్మికుఁడౌ ప్రహ్లాద పౌత్రునిఁ
బ్రాణముతో రసాస్థలికిఁ ♦ బంపి నిరంతర ద్వారరక్షణా
దీనతఁదాల్చి యిందుఁడను ♦ తింపఁగ స్వర్గమునిచ్చి కావవే

చ. ఇలఁగల నెల్లరాజులను ♦ నిర్వదియొక్కపరిఁ వధించి యా
దళముల రక్తవాహినులఁ ♦ దాండవమాడనొనర్చి సాహసం
చలనముఁజేసి నీదు పితృ ♦ జాలముఁగావవె భీషణాకృతిన్
బలమగు గండ్రగొడ్డటను ♦ "భార్గవరాముఁడవై" మహాప్రభూ!

చ. అరయఁగ శంభుచాపము ను ♦ హాద్భుతలీలలద్రుంచి జానకిం
బరిణయమాఁడి తండ్రిపను ♦ పన్వనసీమలనుండి, భూమిజా
హరణ దురాత్ము రావణుని ♦ నాహవమందు హతంబొనర్చి యా
ధరణిజగూడిబ్రోచవె స ♦ దాభువి "శ్రీరఘు రామమూర్తివై"

శా. భూభారంబుచు బాపనందనగిరిఁ ♦ పుత్రుండవై నీవుగా
రాబంబొందుచు పాండవేయులను సం ♦ రక్షించి ధాత్రీస్థలిఁ
శోభామానసమూర్తివై ఖలులకై ♦ శోధించి ధర్మోన్నతిం
బ్రోబాల్యంబుఁ గంస కౌరవులఁగూ ♦ ల్పాలేదె "కృష్ణాకృతిన్"

మహాత్మా! పురాణపూరుషా! నీయాకృష్ణావతారమున నొన ర్చిన మహాకార్యంబులు బొగడ నావశమా? ఈ శ్రీకృష్ణ తులాభార నాటకమునకు సూత్రధారుఁడవు నీవుగావే? శచీ దేవికి మనస్తాపముఁగల్పించి, నాకపారపశ్చాత్తాపమునుగల్పించి సురోపకారమునకై గడంగిజేసినది మొదలు యింతవరకు నడి పించి యింకను నాటించఁగల కపటనాటక సూత్రధారివినీవే, అంతయు తమయనుగ్రహకారణముగాక వేరొండుగలదె.

కృ—నారదా! నీభక్తి శక్తికెంతయు సంతసించితిని. నీమనోభీష్టితంబు సర్వమును గ్రహించితి. నీవు వచించినటుల యీనాటకమున

కు సూత్రధారుఁడను నేనే? ఇంతగాధ నడిపించినది నేనే? ప్రేమకును భక్తియందునుగల తారతమ్యము గనపర్చదలచి యింత చేసితిని. ప్రేమయనునది స్వార్థలాభకాంక్షి. అయ్యది దేహమునకు సంబంధించినది. ఐహికసుఖార్థి, అన్నివిధముల ఘననీయమైనదియు—మోక్షప్రదంబైనదియు భక్తి. భక్తపరులు నాలో లీనమై శాశ్వతమోక్షానందమునకు పాత్రులయ్యెదరు. నాకును నాభక్తులకును లేశమైనను భేదము లేదు. ప్రేమయుతులు వృక్షంబునకు యలముకొన్న తీగెలవలెను, భక్తియుతులు అంటుగట్టిన వృక్షంబులవలెను వేరువేరు సౌఖ్యంబుల ననుభవించెదరు ఇదియె ప్రేమయందును భక్తియందునుగల తారతమ్యము. ఇందులకు నేజేయున దేమనిన భక్తపరులకు సర్వదా కష్టములగల్పించి వారి భక్తిత్రాణ బరీక్షించుచుందును. అయ్యది మూఢులు గ్రహింపనేరక చింతాసాగర నిమగ్నులై అజ్ఞానాంధకారములో మునిగియుందురు. జ్ఞానులైనవారును—భక్తులైనవారును యేతద్విషయము నాలోచించియే కష్టపరంపరలనన్నిటిని నానందముతో సైచి, చిత్తంబున భక్తియనునది వదలక—చలించక—తుదకు ననన్య కైవల్యంబుగాంతురు.

గీ. దహనుకీలల బంగారు ♦ తగ్గి కరము
వన్నెయది కడువృద్ధియౌ ♦ చున్నకరణి
నాదు కష్టాగ్ని చేసదా ♦ నలిగినలిగి
పరమమోక్షంబుగాంతురు ♦ భక్తయుతులు.

నార—దేవా! తావకీ మహావిపన్మాహాత్మ్య బోధామృతమున ధన్యుండనైతి. ఇంక జరుగనున్న కర్తవ్యమునకై బోవుదము.

కృ—నారదా! రమ్ము. (నిష్క్రమింతురు.)

తెరపడును

## 3. వ. రంగము.

---

దృశ్యము—దానమంటపము.

(శ్రీకృష్ణుఁడు సత్యభామా—నారదుఁడు—గర్గుఁడు—రామావధాన్లు—వెంకటదీక్షితులు—నళినియు కొందరు ముత్తైదువులు మొదలైనవారు బ్రవేశింతురు)

గర్గు—సత్యాదేవిగారూ! వ్రతసమయమున భర్తృదాన మొసంగుట విధిగనుక అట్లుసేయుట తప్పదు. ఏమందురు?

సత్య—బ్రాహ్మణయతీంద్రా! అట్లేదాన మొసఁగెదను. దానానంతరమున పతియెత్తు ధనముగాని, పతికిష్టమైన ధనేతరముగాని చెల్లించి నాప్రాణేశ్వరుని గైకొనవచ్చునుకదా!

గర్గు—తప్పక గ్రహింపవచ్చును. ఓసభాసదులారా! ఈవ్రతముసేయు సతీమతల్లులు పతిని దానమొనర్చి ధనాభారమున తిరిగి గ్రహింపవచ్చునని వ్రతధర్మము. కావున మీలో విశిష్టవంశజుఁడును, సద్యయనసంపన్నుఁడును, సకలపురాణశాస్త్రసంవేత్తయు, శాంతైకహృదయుఁడును, పరమభక్తుఁడును నెవరైన నన్ను శీఘ్రగతి నీవితరణమును స్వీకరింపవచ్చును.

వెంక—అవధాన్లుగారూ! నామనవాలకించి నీవువెళ్ళవయ్యా! కృష్ణమూర్తి ఎత్తు ధనమట నీజీవితము చక్కఁగా కూర్చొని గడపవచ్చును. మీకంటె పెద్దలెవరున్నారు. వేదములు నాలుగు తలక్రిందులగా వల్లించినవాఁడవు ఆలోచించెదరేమి?

రామా—దీక్షితులూ! వెర్రిలోబడకయ్యా! సంభావనలుకూడ సూన్యమాతవీ! ఏదోవచ్చీరాని విధమున ఆగర్గమునిగారు మంత్రము చదువుతూంటే వారితోటే ఊ! అంటే మన సంభావనలు మనచేతులలో బడతవి.

వసం—అవదాన్లూ! నీవు పరిగ్రహించవయాదానము.

వెంక—పోనీ మువయ్యా! ఆతూనికధనము మనమందరము పంచుకొన వచ్చును.

రామా—(లేచి) ఆర్యవర్యా! ఈసభాసదులలో దానమున కర్హులైన వారు నారదమునీంద్రులుతప్ప అట్టి సులక్షణములుగలవారు ఒక్కరును లేరు. కావున నాపరమభాగవతోత్తమునకే దాన మిచ్చి వ్రతధర్మము నెరవేర్పుడు.

అందరు—(సమ్మతి సూచనగా చప్పట్లుకొట్టుచున్నారు.)

నార—(లేచి) సభాసదులారా! ఈయుత్తమదానమునకు నేనే యర్హుం డనని వచించి నాకీ మహావితరణము సంప్రాప్తమౌనటుల సే యుచున్నందులకు మీకెంతయు కృతజ్ఞుడను.

గర్గ—దేవీ! ఈపుష్పహారముతో గృష్ణుని ఆపారిజాతవృక్షంబునకు గట్టివేయుము.

సత్య—(పుష్పహారముతో దరికేగి సిగ్గుపడుచున్నది.)

కృ—దేవీ! సిగ్గుపడుచుంటివా?

మ. అతివానీవిక సిగ్గుసందబని మే ♦ లా? రాగదే తావకీ
వ్రతధర్మంబిదియాట తప్పదిక ధై ♦ ర్యంబే మహాభూషణా
న్వితమంచుం గనుదెంచి శీఘ్రగతినన్ ♦ వృక్షంబునంగట్టి నీ
వ్రతసంపూర్ణముగాఁగఁ జేసికుమ ధ ♦ ర్మశ్రేయముంగాంచవే.

సత్య—(కృష్ణుని చెట్టునకు గట్టుచున్నయది)

కృ—ఇక కర్తవ్యమునకు గడంగుము.

నార—(స్వ) ఆహా శ్రీమన్నారాయణ లీలలు అత్యద్భుతములుగదా! ఆనాడు బాలప్రాయమున తల్లిచే రోటను గట్టబడిన పరాత్పరుఁడు నేడు భక్తసంరక్షణార్థమై నొకయబలచే వృక్షంబున బంధింపఁబడి యున్నాఁడు. సర్వేశ్వరుని మాయానాటకము గ్రహింప నలవికాదుఁగదా!

గర్గ—దేవీ! ఇక నీవీ నారదునకు పాదపూజఁ గావింపుము.

సత్య—(జల కలశముఁదెచ్చి నారదుని పాదముల గడుగుచు)

నార—తల్లీ! నీవీవ్రతానంతరమున తప్పక భక్తురాలవయ్యెదవని నా నమ్మకము.

సత్య—(పూర్తిఁజేసి) పూజ్యుఁడా! భక్తురాలనేఁగాక మీదుమిక్కిలి పతివ్రతాశిరోమణి నను కీర్తికూడ గాంచెదను.

వసం—(స్వగ) మాసత్యాదేవిగారి కీవేళ గర్వభంగము తథ్యము.

గర్గ—దేవీ! ఇటు రమ్ము. నారదా! నీవీదానము పరిగ్రహించుము.

"అస్మైబ్రాహ్మణాయ నారదాయ
దాతాసత్యభామా నామ్నీ।
సమస్తదేవతా ప్రీత్యర్థం భర్తృదానం"

(సత్యచేతిలో నీరుపోయించి కృష్ణుని చేతులగుండ నారదుని హస్తములం బడునట్లు చేయించి) దేవీ! యిట్లు చెప్పుము

"తుభ్యమహం సప్రదదేనమోనమః"

సత్య— "తుభ్యమహం సప్రదదేనమోనమః" (అనును)

గర్గ—"దేవస్యప్రీతయే దానం కృష్ణస్యార్య
మతుష్టయే। బహుభ్యాంపుష్ట హస్తాభ్యాం
పుణ్యకర్మ ప్రసూతయే"

(కృష్ణుని నారదునకిప్పింపజేయును)

"వస్త్రైవతే ప్రతిగృహ్ణాతు"

దేవీ! ఇక పారిజాతవృక్షమును—కృష్ణుఁడును కృష్ణుని శరీరము నంగల ఆభరణములున్నూ యీనారదునివి.

నార—ఆహా! ఏమినాయదృష్టము!

గీ. సతతు తెంద ఱైన ♦ సత్య కేదక్కిన
భాగ్యరాసి యైన ♦ పరమపురుషు
వేదవిదుల కైన ♦ విజ్ఞానులకు నైన
నందరాని వేల్పు ♦ నందగంటి.

గర్గ—దేవీ! ఇక బ్రాహ్మణసంభావనలు రానిమ్ము. అనంతరమున తులాభారము గావింతము.

సత్య—నళినీవసంతులారా! మీరీబ్రాహ్మణులను లోనికిదీసికొని వెళ్లి దక్షిణతాంబూలాదులిచ్చి పంపుఁడు.

నార—భూసురులారా! దక్షిణతాంబూలాదులైన పిమ్మట తులాభారము తిలకించిపొండు.

(బ్రాహ్మణులు నిష్క్రమించి మరలవచ్చి కూర్చుందురు)

గర్గ—మునీంద్రా! శ్రీకృష్ణుని తులలోఁ గూర్చోబెట్టుఁడు.
నార—(అటులఁజేయుచున్నాఁడు)
గర్గ—దేవీ! ఇకనీప్రాణేశ్వరునిఁ దూచుకొనుము.

సత్య—(ఎంతధనము వేసినను కృష్ణుఁడు భారమాటచే విచారముతో) అక్కటా! ఇదేమిమాయ చెపుమా! మంగళసూత్రమువిడి నా సర్వధనధనేతరములు వైచియున్నను ప్రాణేశ్వరుఁడే భారమగుచున్నాఁడే? నారదా! ఇదేమి చిత్రసంఘటనము నడిపించితివయా?

మ. అకటా! గాంచనిదేమి సంఘటనమో ♦ యాత్మన్విచారింప, మాతక సర్వాభరణంబులాదిగల దౌ ♦ వ్యంబెల్లయుందెచ్చి, ప్రా

యకనీతాఁ సునవై యుంచినను భా ♦ రంబమ్యో హౄణేశ్వరుం
డకటా నావ్రతభంగమాగద నిజం ♦ బాత్మేశు భారంబునన్.

వసం—అమ్మా! మాయింటియాపె దబ్బారేకు గజ్జెలవడ్డాణము తె
ప్పించమనెదవా?

నార—తల్లీ! శ్రీకృష్ణుని తూయగల ధన సంభారమునీవద్దగలదా
యని మున్మాటికి నిన్ను తర్కించియుంటిని. అది నీవు గ్రహిం
చలేకపోతివి. నన్నేమిసేయమనెదవు.

గీ. నిఖలజగములకుక్షి యం ♦ దేగలట్టి
విశ్వగర్భుని తులదూయు ♦ విత్తమొందు
గలదె? యదిఘనభక్తి మా ♦ ర్గంబెగాక
ధనధనేతరమ్ములవేల ♦ తలిరుబోణి!

సత్య—నారదా! ఆసంగతి ముందేలచుడువనైతివి. అక్కటా! చిరకాల
పరిచయముచేత మన్నాథుడు సులభుడనియే తలంచితికాని
విశ్వగర్భుడని తలంచనైతికదా!

కృ—సత్యా! నన్ను నీవు ధనసంభారాదులొసంగి గైకొనజాలవా?
నన్నీ జగడాలచీలివశము జేయుదువా?

చ. మగువరొనన్ను తాఁసున స ♦ మానముసేయు ధనంబు
సర్వమీజగతి ద్వదీయసౌధమున ♦ సత్యమెయున్నదియామటంచునే
దగవచియించిన న్వినక ♦ తప్పక నావ్రతమాచరించిన న్
జగడము నీకుకేవలము ♦ సల్పితి పీగతి నీకు శ్రేయమే.

నార—కృష్ణా! ఇకమాట్లాడవలదు. సభాసదులెల్లరు పోవచ్చును.

(కృష్ణ నారద సత్యభామయు తప్ప అందరు నిష్క్రమింతురు.)

అబ్బా! ఈవీణ నాకు భారమైనది. కృష్ణా! ఇదిభుజమున నిడు కొనుము. ఇదిగో కమండలము యిందు మందాకినీజలమున్నది సుమా? సత్యా! నేబోయివచ్చెదను. నాకీ సర్వజ్ఞుని దాన మిచ్చితివి. సర్వదా నీకీర్తి లోకంబున చాటుచుండెదను.

*క. పతిదానంబిచ్చుట నీ
వతులిత సత్కీర్తి బడయు ♦ మతివరో యికనా
కతికాలంబాయెను నా
మతివచ్చిన పగిది బోదు ♦ మాధవుతోడన్.

కృష్ణా! రమ్ము!

సత్య—నారదా! ఇదేటిన్యాయము? నలుగురలో నాకు తలవంపులు ఘటింప సేయుటకా నీవీవ్రతోపదేశము సల్పితివి. ఆహా! ఎంత చిత్రమైన హితోపదేశము సల్పితివి నారదా! కలహాసనుఁడ వను నామము సార్థకపరచు కొంటివిగదా!

క. వ్రతమనుచుఁ దెలిపినను స
మ్మతిపడఁగాఁజేసి కపట ♦ మార్గమునను నా
పతిదానముఁగొని తుదకీ
గతి నన్నవమాన పరుపఁ ♦ దగునె మునీంద్రా!

నార—అమ్మా! మొదట నామాటలయందుగల యదార్థము గ్రహింపక తుదకీవిధమున కృష్ణుని నాకు దానమొసంగితివి. యిందు నాతప్పేమియు లేదు. (పులితోలు జారవిడిచి) కృష్ణా! ఆశార్దూల చర్మమిటు తెమ్ము.

కృ—(తెచ్చియిచ్చుచున్నాఁడు.)

నార—నీవు జాగ్రత్తగా చంకను బెట్టుకొమ్ము. (స్వ) ఆహా! భగవంతుడు భక్తాధీనుఁడనుట సత్యేతరము కాదుగదా!

సత్య—(స్వ) ఆహా! నాధున కింతటిస్థితి ఘటింపజేసితిని. ఈనారదుఁడు బహుకష్ట పెట్టుచున్నాఁడుకదా! (ప్రకా) అయ్యో! నారదా? నానాధుని నాకు మరలనివ్వవా? ఇంతటినిర్దాక్షిణ్యమా!

చ. వరసతినైన నాకు సరి ♦ వారలలోఁ దలవంపులయ్యె నీ
చరితమెఱింగి నీపలుకు ♦ సత్యమటంచును నమ్మిచాలఁదొం
దరపడి ప్రాణనాథు నిటు ♦ తప్పఁదలంపక ధారవోసితిన్
హరిహరి! మేఁక వన్నెపులి ♦ వైతివిదేమిటికయ్య నారదా!

నార—కృష్ణా! నీసతినిన్ను నాకు ధారవోసినమాట సత్యమా? కాదా? చూడుము నన్నెటుల దూషింపుచున్నదో.

కృ—తపస్వీ! దానానంతరమున దూషణతోను విచారముతోను పని లేదు. కావలసిన నాయెత్తుధనంబు నొసంగి గైకొనుము. అంతవఱకు నేనీనారదునకు దాస్యము సల్పుట తప్పదు.

నార—కృష్ణా! ఇచ్చటనున్న యెడల నాకీదూషణలుతప్పవు రమ్ము అంగడికి బోవుదము. నీవు నాకెందులకు ఏమహాభాగునకైన నిన్ను విక్రయించి సత్యాదేవి దూషణకు దూరమయ్యెదను లెమ్ము.

(పోఁబోవుచున్నారు)

సత్య—నారదా! నామాటవినవా? పతిని బజారునబెట్టి అమ్మెదవా? ఇదినీకు ధర్మమా?

*గీ. తపసివయ్యు నాత • తాయిపై యవరోధ
జనము రచ్చఁబెట్ట • జనునటయ్య
వేడుకకునుఁబిల్చి • వెక్కిరించుటనీకుఁ
దగునటయ్య పెద్ద • తనమటయ్య!

అనుబంధము. 8.

నార— అనుబంధము. 9.

కృష్ణా! రుక్మిణి! నిన్ను వీథులగుండ డ్రిప్పి సాధనము పరిగ్రహింతును.

(కృష్ణునితో నిష్క్రమించుచున్నాఁడు)

సత్య—హా! ఇకనాకేదిదారి? నళినీ! నళినీ! నారముఁడెంతటి పన్నుగడపన్ని పోయెనో వినియుంటివిగదే? నానాథుఁడు నాకులభించు నుపాయమెద్దియుఁగానరాదు యేమిసేయుదునే? తన తల్లిదండ్రాది సహోదర మిత్ర బృందాదులరుదెంచి నన్ను ఎంతగా దూషింతురోగదా? తన భార్యాసమూహమెల్లరు నన్నెట్టి కట్టడులాబెట్టుదురోకదా? హా! దైవమా! నీవును నారమునకే సహాయుమైతివా ?

సీ తనుఁగన్న జననియే • చనుఁదెంచి మాపుత్రి
నేమిచేసితివన్న • నేమనందు ?
తన సహోదరులాది • ఘనులు మాయన్ననే
యేమిచేసితివన్న • నేమనందు?

తన యష్టభార్యాది ♦ తరుణులేమానాథు
నేమిచేసితివన్న ♦ నేమనందు?
తనదు పుత్రులిందు కం ♦ దర్పుండు మాతండ్రి
నేమిచేసితివన్న ♦ నేమనందు?

గీ. తనదు కులజులకెట్లు ము ♦ దంబుగూర్తు?
తనదు భక్తులకేమని ♦ తగవచింతు?
తనదు స్నేహాళి నెట్లు సం ♦ తసము జేతు?
తనదు కేళీవిహారము ♦ ల్గనుట యెట్లు?

నళి—అమ్మా! సమాశ్వాల్లుము, నీనాథుని గైకొనునుపాయ మాలో చింతము లోనికి రమ్ము.

అనుబంధము 10.

(నిష్క్రమింతురు)

తెరవాల్రలును.

ఇది తృతీయాంకము.





శ్రీరస్తు.

# శ్రీకృష్ణతులాభారము

అను

# తులసీమాహాత్మ్యము.



## చతుర్థాంకము.



స్థలము—అక్రూరుని పూజాగృహము.

(అక్రూరుఁడు ప్రవేశము.)

అక్రూ—ఆహా! శ్రీకృష్ణభగవానుని సందర్శనమెప్పుడు ప్రాప్తించునోకదా! తిరిగితిరిగి యెంత యన్వేషించినను ప్రాప్తించదయ్యెను. కటకటా! నేనెట్టిపాపకార్యము లాచరించితినో—ఎట్టిదుష్ప్రవర్తనకు గడంగితినో నాకామహాత్ముని దర్శనము దూరమయ్యెనుగదా! కృష్ణా! నీభక్తుని నన్నింత కష్టపెట్టనీకు సమ్మతమా! సత్యభామ సౌధమునఁగానరావే, రాధామందిరమున లేవే, రుక్మిణీదేవిగృహమునందైన కనుపింపవే? ఏభక్తుని మందిరముననుంటివి. శ్రీమన్నారాయణ లీలామానుష విగ్రహుండవైన నీమాయలు దురూహ్యములు, నీచేష్టలు అభేదంబులు నీకపటనాటకాప్రదర్శన మతిచిత్రము. దేవాదిదేవా! పురాణపురుషా! ఒకసారి నామందిరమున సాక్షాత్కరించి, నీభక్తునకమందముదంబు చేకూర్పలేవా? అనంతా! నీవెచ్చోటదా

గియుంటివి? స్నేహవాత్సల్యమునకో భక్తవాత్సల్యమునకో చెచ్చెర వాగ్రహమునకు విచ్చేయుము. ఆహా! భవన్నామ మహాత్మ్యమత్యంత సంతోషదాయకముసుమా?

సీ. దేవాదిదేవ! నీ ♦ దివ్యనామంబె సూ
మరణభీతినిమాన్పు ♦ మంత్రమయ్యె
దేవాదిదేవ! నీ ♦ దివ్యనామంబె సూ
సంపదలకు నిల్లు ♦ స్థానమయ్యె
దేవాదిదేవ! నీ ♦ దివ్యనామంబెసూ
కలుషంబులండ్రుంచు ♦ ఖడ్గమయ్యె
దేవాదిదేవ! నీ ♦ దివ్యనామంబెసూ
విబుధకోటికి గల్ప ♦ వృక్షమయ్యె

గీ. ధరను నీదివ్యనామ మం ♦ త్రంబెదేవ!
మానివర్యులకును మోక్ష ♦ మార్గమయ్యె
భారతీవల్లభునికైన ♦ వశముగాని
తావకీమహాత్మ్యమదియెన్న ♦ దరమె నాకు.

కృష్ణా! ఇకనైనఁగరుణవహింపవా? భక్తవత్సలుడవుకావా? భక్తజనసమూహమునకు ముక్తిఘటింపసేయరావా? తొల్లి భక్తజనులను సర్వదా కాచియుంటివి కావా?

సీ. నీవెదైవమటంచు ♦ నినుఁ గొల్చినట్టియా
ప్రహ్లాదు బాధలఁ ♦ బాపలేద
నీవె మాప్రాపని ♦ నినుఁజేరినట్టి వి
భీషణురాజుఁ గా ♦ వింపలేద
నీవె సర్వంబంచు ♦ నినుఁజూడ వచ్చిన
పేదఁగుచేలు గా ♦ వింపలేద
నీవెదక్షుఁడవంచు ♦ నినుఁ గొల్చుచున్నట్టి
రాతినాతినిఁజేసి ♦ కాంలలేద

గీ. నీవె భగవంతుఁడ వటంచు ♦ నెమ్మనమున
స్మరణ సల్పెడి మానులన్ ♦ సాకలేవ
పతము తావకనామమే ♦ మతిఁదలంచి
పూజలొనరించు భక్తుని ♦ బ్రోవరాద!

(కన్నులను మూసికొని) యిందిరాధవా! మాధవా! రావా? భక్తునకు
భవదీయ సందర్శనమొసఁగలేవా ?

కృ—(ప్రవేశించి) భక్తాగ్రగణ్యా! అక్రూర! కన్నులను తెరువుము.

అక్రూ—కృష్ణా! నేఁడుగదా! నేధన్యుఁడనైతి. కేవల భక్తవత్సలుఁ
డవు, నేడేభక్తుని మందిరమున బాధింపఁబడి యుంటివో తెల్పి
నాసందేహము తీర్పుము.

కృ—అక్రూరా! నేఁడుజరిగిన విచిత్రకథ నీవు వినియుండలేదా ? సత్యా!
భామనన్ను విధేయునిఁగా జేసుకొనఁదలంచి పుణ్యకవ్రతమా
చరించినది. వ్రతధర్మము ప్రకారము నన్ను నారదునకు ధార
వోసి తిరిగి గ్రహింపలేక నన్నా నారదుని వశముఁగావించినది.
అదె నారదుడు నన్నిట్లు వీధివీధుల ద్రిప్పి శ్రమబెట్టుచున్నా
డో వీక్షింపుము (కన్నులు తుడుచుచున్నాఁడు )

అక్రూ—ఆహా! నారాయణా! వేదపారాయణా! కృష్ణా! భవన్మహ
త్మ్య విశేషములు దురూహ్యంబులే సుమా! ఆహా! భక్తా
ధీనుఁడవు కనుకనే నారదుని వెంటఁ దిరుగుచుంటివి. ఎచ్చోటఁ
జూచినను తావకమనోహరవిగ్రహ సందర్శనములేగదా ! యి
చ్చట మామకమందిరమున—అచ్చట నారదుని వెనువెంట—
రుక్మిణిమందిరమున—వెండియు సమస్తభక్తజన సౌధముల
యందును తావక దివ్యమంగళ విగ్రహసందర్శనమే. ధన్యోస్మి!
ధన్యోస్మి !

మ. హరినారాయణ! యిందిరాధవ! విధి ♦ ప్రాద్యాత్మ! రామప్రభూ
సురసంసేవిత! భక్తవత్సలకళా ♦ శుభ్రస్వరూపాన్వితా!
ధరణీశా! భవసాగరాంతరమహా ♦ దారిద్ర్యవిచ్ఛేదనా!
వరదా! భూరిదయాసముద్ర! ఘనపదే ♦ వా! భక్తచింతామణీ!

శా. కామక్రోధముఖారిసంహరణ! స ♦ త్కారుణ్య సంధాయకా!
ఓమానీశ్వరపాల. కేశవ! నమో ♦ యాదేవ నారాయణా!
స్వామీ! నీవలసాత్వ దాప్రదిన భీ ♦ ష్మబ్రహ్మచారిన్ కృపన్
నీమాహాత్మ్యముచేతఁగావవె చల ♦ స్నిరేజ పత్రేక్షణా!

విశ్వగర్భా! విశ్వమంగళమునకై గదా! నీవీకపట నాటకము నాడించుచుంటివి. జగన్నాథా! తావకీనాటకసందర్శనమున ప్రేక్షకులు తప్పక భక్తపరులు కాగలరు.

కృ—అక్రూరా! నీభక్తికి సంతసించితిని. ప్రేమయందును భక్తియందును గల తారతమ్యము ప్రజాలోకమునకు విశదము సేయఁదలంచియే నేనీరూపకము నాడించుచుంటిని. ఒక్కక్షణములో నీవునువచ్చి ఆచిత్రరంగముజూడుము నేఁబోయివచ్చెదను.

అక్రూ—మహాప్రసాదము స్వామీ!

(కృష్ణుఁడు నిష్క్రమించును)

తెరవ్రాలును.

---

## 2. వ. రంగము.

---

దృశ్యము—ద్వారకాపురవిపణిశ్రేణి.

(కృష్ణునిమెడలో పూలదండబట్టుకొని నారదుఁడు ప్రవేశము)

అనుబంధము. 11.

నార—పౌరులారా! చూచెదరేల? రండు! రండు! కృష్ణునియెత్తు ధనంబొసంగి తీసుకొనుఁడు. రండు ధనంబొసంగుడు.

సీ. మల్లోకములకెల్ల ♦ మూలకారకుఁడయ్యు
స్వల్పుఁడై కనిపించి ♦ వరలువాఁడు
శ్రీలక్ష్మిభార్యగాఁ ♦ జేకొన్నవాఁడయ్యు
గొల్లభామలపొందె ♦ గోరువాఁడు
శాంతిశమదమాది ♦ సద్గుణాఢ్యుండయ్యు
తస్కరలీలలఁ ♦ దనరువాఁడు
విశ్వగర్భుఁడాది ♦ విష్ణుఁడయ్యునుమాన
వస్వరూపుండయి ♦ వరలువాఁడు
గీ. ఆదిమధ్యాంతరహితుఁడై ♦ యలరువాఁడు
నిత్యసత్యగరిష్ఠుఁడై ♦ నెగడువాఁడు
అతఁడు కృష్ణుండు నావశ ♦ మయ్యెనేఁడు
ధనధనేతరమ్ములొసంగి ♦ కొనఁగరారె.

ఏమీ? శ్రీకృష్ణపరమాత్ముఁడు సామాన్యుఁడనియా మీసంశయము కాదుకాదు.

సీ. అబ్ధిదాగినసోము ♦ కాసురుభంజించి
వేదముల్ దెచ్చిన ♦ వీరుఁడితఁడు
కచ్ఛపాకృతిఁదాల్చి ♦ ఘనశైలమును నెత్తి
సురలరక్షించిన ♦ శూరుఁడితఁడు
క్షోణిరక్షార్థమై ♦ సూకరాకృతిఁదాల్చి
స్వర్ణాక్షుఁ గూల్చిన ♦ శౌరియితఁడు
ఋషులాదు బాధలఁ ♦ బాపి రక్షింప నృ
సింహుఁడై బుట్టిన ♦ శ్రీశుఁడితఁడు
గీ. పొండివామనరూపుఁడై ♦ దండిబలుని
నేలక్రిందికిదొక్కిన ♦ నేతయితఁడు
నేఁడు నావశమాయెనిం ♦ కేలజాగు
పరగఁగొనరండు ధనమిచ్చి ♦ పౌరులార!

(అప్పుడు సత్యభామా నళినులు ప్రవేశింతురు.)
అనుబంధము. 8. 9.

సత్య—అయ్యో! నారదా! నానాధుని నాకొసంగవా? నాకు నలుగురిలో దలవంపులు ఘటింపసేయుచుంటివా? ఇది నీవంటి వానికి తగునా?

*ఉ. చాలు యతీంద్రమావిభుని ♦ సాటిలతాంగులు నవ్వుచుండ నీ
లీలను వీధివీధులఁజ ♦ రింపుచు నమ్మెదనంచు ద్రిప్పఁగా
మే లెధనంబు నాకడను ♦ మిక్కిలి మ్రొగ్గుట మీ రెఱుఁగరే
తాలిమి మాలి మమ్మిటుల ♦ తల్లడ బెట్టుట మీకు న్యాయమే.

తొందరపడకు నారదా. నాధనసంభారములు మీ రెఱుఁగరా? ఏమిమాయయో నాథుఁడు భారమయ్యెను. చిరకాలపరిచయమున నాథుని సులభుండనియే భావించితికాని, విశ్వగర్భుండని యెఱుఁగనైతి.

నార—తల్లీ! నీనాథుని నీకు గావలసిన మొనల ధనధనేతరమ్ములదెమ్ము అట్లు సరి తూఁచుకున్న నన్నేమి సేయుమనెదవు. కృష్ణా! రమ్ము. ఈసత్యాదేవి నాకర్తవ్యమున కాటంకపఱుచున్నది రమ్ము ఇంకొకపేధికిఁబోవుదము.

(నిష్క్రమించును.)

సత్య—హా! దైవమా! ఇక నాకేదిదారి? ఎంతని జడదారిని బ్రార్థింతును? ఎంతని యిటు నలుగురు జూచుచుండ వీధివీధుల దిరుగాడుదు? నళినీ! నేనేమిసేతునే?

గీ. భూరివ్రతమటంచు ♦ పొంగించి మన్నాథు
దానముగ గ్రహించి ♦ తరలెఁ దపసి
యేమి సేయుదాన ♦ నెంతని ప్రార్థింతు
పతినిఁ బడయు టెట్లు? ♦ బ్రతుకు టెట్లు?

నళి—అమ్మా! సమూశ్విల్లుము. అరుగో కృష్ణనారదులా వీధిలో నున్న
వారు. అచ్చటికి పోయి ప్రార్థింతము రమ్ము.

(నిష్క్రమింతురు)

నార—(కృష్ణసహితము ప్రవేశము) పౌరులారా! రండు మాధవునంత
టి మాధవుఁగొనుటకు సందేహించెద రేల? కృష్ణా! మగవారు
నిన్ను గొన సంశయించుచున్నారు. ఇక మహిళాలోకమును
బిలిచెదనుఁగాక! ఓభామామణులారా! రండు రండు.

* సీ. భామామనోజ్ఞ చూ ♦ డామణి గొనరమ్మ
రత్నభూషలొసంగి ♦ రమణులార!
అనురూప రూపనా ♦ యకమణిఁ గొనరమ్మ
కనక రాసులొసంగి ♦ కాంతలార!
దాససంతాన చింతామణిఁ ♦ గొనరమ్మ
విలువ సొమ్ములొసంగి ♦ వెలదులార!
వరగోప గోపికా ♦ వ్రజమణిఁ ♦ గొనరమ్మ
విలువెత్తుధనమిచ్చి ♦ మెలతలార!

గీ. సుందరుఁడు శుభసంపన్న ♦ మందిరుండు
దుర్లభుండయ్యు సులభుడై ♦ తోఁచినాఁడు
శ్రీనివాసు నాత్మీయుఁగాఁ ♦ జేసికొనగ
ధనముఁగలవారు రారమ్మ ♦ తరుణులార!

వెలదులారా! చూచెద రేల? రండు. అలక్ష్యముఁ జేసిన మరల
దొరకఁడు.

శా. కృష్ణుండీతఁడు వీనిఁగొన్న సతి స ♦ త్కీర్తింగనుఁ లోకవ
ర్ధిష్ణుం డీతఁడు వీనిఁ గొన్నసతి సు ♦ శ్రేయస్థితిఁ గాంచుఁ బ్రా
విష్ణుం డీతఁడు వీనిఁ గొన్నసతి భా ♦ సిల్లుంగళాధామమై
విష్ణుం జిష్ణుని గృష్ణు నిత్తుసరిగా ♦ విత్తంబునాకిచ్చినన్.

కం. హరిగల్గుచోటున విడువక
సిరియుండునటంచు బుధులు ♦ చెప్పగవినరే
హరిమధ్యలారమిారీ
హరిమెత్తుధనం బొసంగి ♦ హరినింగొనరే.

సత్య—(నళిని సమేతయై ప్రవేశించును.) నారదా! అనుబంధము 8,9 నానాథుని నాకొసంగవా? నాథా నీవైనను జెప్పరాదా? మీారిరువురును దొంగవేషముపన్ని నన్ను నలుగురిలో నవమానపర్చదలంచితిరా? మాటాడవేమి? అయ్యో నారదా! నీకింత నిర్దాక్షిణ్యము తగునా?

చ. కరయుగళంబుమోడ్చియొక ♦ కాంతవిశేషవిషాద స్వాంతయై
నిరతమునీదు వెంటబడి ♦ నిక్కముప్రార్థనసేయుచుండ నో
ధరణిమునీంద్ర సుంతదయ ♦ దల్పవిదేటి ప్రవర్తనంబు నీ
సరసముమాని నాథునొసంగుము వేడెద మౌనికుంజరా.

నార—అమ్మా! నా వెంటబడకుముపొమ్ము. నీపతి నీకుకావలయునం దువేని తూచుకొనుము. పలుమాటలతో బనియేల? కృష్ణా! నిన్ను మహిళాలోకముగూడ కొనకున్నవారే? రమ్ము. ఆవీధికి బోవుదము. (నిష్క్రమించుచున్నారు.)

సత్య—హా! మాలదైవమా! నన్నెట్టికష్టముల పాలుజేసితివి? నాకేది మార్గము? ఈనారదుడే యిట్టి మాయానాటకము నడిపించి నన్ను నలుగురిలో పరాభవము సేయునని కలనైన దలంపనైతికదా? నళిని! నీవైనను నాకుపాయమెద్దియైన వచింపవే?

అనుబంధము. 13.

నళి—అమ్మా! ఆయుపాయము నారదునే యడిగినబాగు. కావున అల్లదుగో ఆవీధిలో నున్నవారు. అచ్చటకు బోవుదము రమ్ము.
(నిష్క్రమింతురు.)

నార—(కృష్ణునితో సహా ప్రవేశము) కృష్ణా! నిన్నెవ్వరును కొనజాల కున్నవారేఁ? ఈలోకమున భక్తిక్రమముగా క్షీణదశకు వచ్చుచు చున్నటులున్నది. విగ్రహారధనమన్న ప్రజలకు విసుగుదల యెక్కువ యగుచున్నది. ఈవీధిలో యాదవులను బిలిచెదనుఁ గాక! ఓయాదవులారా! రండు రండు!

గీ. ఎవఁడు చెరసాలయందుద్భ ♦ వించి, మామ
కంసుని హతంబొనర్చి లో ♦ కమునుఁగాచె
నట్టి కృష్ణుండు నావశ ♦ మయ్యెఁగాన
ధనముఁ గలవారు రారయ్య ♦ కొనఁగరయ్య.

(గోపాలుఁడు ప్రవేశము)

గోపా—ఔరా! ఎవఁడురా! మాశ్రీకృష్ణభగవానుని విక్రయించు వాఁడు

(దామోదరుఁడు ప్రవేశము)

దామో—

మ. అరరే వరాధవునట్టి మాధవుని నిర్లక్ష్యంబుఁగా జూచి నీ
సరణి న్వీధులఁ ద్రిప్పి యమ్ము నతఁడా ♦ చండాలు డెవ్వాఁడురా!
ధరణిన్ యాదవసంఘనాథుఁడని యా♦త్మన్ సుంతయోచింపఁడో
కరుణంబూనఁడో కండ్లులేవో రా నఁడా ♦ కార్పణ్యునిం దెల్పరే.

గోపాలా! ఎవఁడో వీధులవెంట శ్రీకృష్ణుని యమ్ముచున్నానని పేలు చున్నవాఁడు ఎవ్వండై యుండును?

గోపా—అల్లఁడుగో నారదుఁడే? వాని పీచమడంచి గోపాల కృష్ణుని శ్రిమఁ దీర్పదము రమ్ము.

(సమీపించుచున్నారు)

నార—కృష్ణా! యాదవులుఁ గాబోలు కర్రలతోను కత్తులతోను నాపైఁ బడవచ్చుచున్నారు. వారింపుము.

కృ—యాదవులారా! ఇదేమి సన్నాహము పోండు. నాయుఁడు ప్రేమచే నిట్లు సల్పితిరి గాన సైరించితి. మాట్లాడక మీమీతావుల కేగుఁడు పోండు.

గోపా } —(నిష్క్రమించుచున్నారు.)
చామో }

నార—కృష్ణా! బహుశ్రమ ననుభవించినదికదా! ఇకనినుఁగొనువారు ప్రపంచమున లేరనియే నానమ్మకము రుక్మిణీదేవితప్ప యితరులు నిన్ను తులఁదూయుట యసాధ్యము.

సత్య—(సఖీసమేతయై మరల ప్రవేశము) నారదా! నన్నెందులకు శ్రమఁబెట్టెదవు, కరుణవహించి నాప్రాణేశ్వరుఁడు నాకు మరల లభించునుపాయముఁ దెల్పుము.

నార— అనుబంధము. 12.

వసం—(జాంబవతీ మిత్రవిందలతోఁ బ్రవేశము) దేవేములారా! అల్లదే సత్యభామ మీామగని నారదునకు ధారవోసి యెట్లు పరితపించుచున్నదియో వీక్షింపుఁడు.

జాంబ—ఏమే? సత్యా! నీకింతటి యహంభావమేటే? మనయందరకు సమాన భాగ్యంబైన ప్రాణేశ్వరుని నారదునకు దానమిచ్చితివా?

ఉ. ఆసురవానిచంద్రునెడ ♦ యంతటిప్రేమయె నీకుయున్ననే
భాసురహేమరత్నములో ♦ భవ్యగృహంబులో లేకనీ ధనా
రాసులో ధారవోసి యను ♦ రాగముఁజూపిన బాగుఁగాని, ప్రా
ణేశు నొసంగియుంటివి భ ♦ లీ విపరీతముఁగాదె పాపినీ!

మిత్ర—అతిగర్వాంధప్రమత్త హృదయురాలా! తుదకెంతటి సాహసమునకుఁ గడఁగితివే?

గీ. ప్రాణనాథుని మాయక ♦ ప్రాపుగోరి
నెటులఁ జేసిన నేమాయె ♦ నెవ్వరనుఁగు
వారటంచు నెంచితివటే ♦ పాపి! నీవు
కాంతుఁగోని తేజ కోపినీ ♦ కదలవేమి?

జాంబ—పలుకవేమె పాపిని! నాథుఁడు వలపువలలో జిక్కెకదాయని నీయిష్టమువచ్చినట్లు సాహసించితివా? పైగా దొంగవిచారము నభినయిం చుచు టివా?

ఉ. తల్లియుఁ దండ్రియుస్మరియుఁ ♦ దమ్ములు మిత్రులు పుత్రులుండ నీ యుల్లమునందు సుతంతుని ♦ యోచనసల్పక ప్రాణనాథు భీ తిల్లక ధారవోసికడు ♦ నీవిధి కన్నులనీరుఁగార్చెదే యొల్లరువిన్న “ఛీ”యనరె ♦ యెంతటి దుష్టమనస్కురాలవే.

మిత్ర—ఏమే? శెల్లముఁగొట్టిన రాయినలె నూరకుంటివి. నీవ్రతభంగ మే కాదుసుమా! ఇపుడు నీకు గర్వభంగముకూడ ప్రాప్తించి నదా? అతిగర్వాంధప్రమత్తురాలవై మావంటి నారీమణు లను—రుక్మిణిని—చులకనఁగఁజూచినందులకిది ప్రతిఫలము. తెమ్ము! మానాథునిమాకిమ్ము.

సత్య—సపత్నులారా! నేనెఱుఁగక, ప్రణయాంధనై, నాథుని నార దునకు దానమిచ్చినమాట వాస్తవము. యికనన్ను ఎన్నిదూ షణలుబెట్టినను శిరముఁదాల్తును. కరుణమాలి కొట్టఁదలంచి నను కాయమొస గుదానను. నాయఁదు కినుకఁబూనక ఆనా రదుని ప్రార్థించి ప్రాణనాథునిఁ గాపాడుఁడు.

నార—(స్వ) ఈసత్యాదేవికి సరియైన గర్వభంగమయ్యెను. ఆహా! ఎంతటి కఠినాత్మురాలు యెంతటిలో సపత్నులకులొంగిపోయి నది. కానిమ్ము రుక్మిణినికూడ బ్రతిమాలి తీసుకవచ్చినఁగాని కార్యసాఫల్యముకాదని వచించిఁ సత్యచే యట్లుచేయించెదను గాక!

మిత్రి—నారదా!

గీ. మాధవుని భార్యలము మేము ♦ క్షమహినినుండ
దానమిచ్చుట సత్యకే ♦ తగునచెపుము
యెఱుఁగకావిధి నొసగిన ♦ నెఱిఁగికూడ
దానమునుఁగొనుటదినీకు ♦ తగునెచెపుము.

జాంబ—కలహాప్రియా! ఇది నీకడుపుమంట కపట ప్రణయ నాటక
చిత్రమా?

గీ. తగుమనని దానమివ్వ నా ♦ మగువకేమి
ఘనతర స్వతంత్రముగల ♦ దనుచుచేసె
చేసెబో దానమిటులీవు ♦ స్వీకరింప
దగునె తమవంటివారలో ♦ తాపసేంద్ర!

నారదా! మాధనకనకవస్తువాహనములతోనైన నాధునిఁ దూసుకొను
వారముకాని, యిట్లు సర్వదా నీకు దాస్యము సేయనిత్తుమా?
రమ్ము తులామంటపమున కరుగుదము.

నార—ఓవెఱ్ఱినారీమణులారా! ఇంకను వెఱ్ఱిలోనే పడియుంటిరా?
భక్తియందుఁగల ప్రభావము నెఱుంగక మీరును సత్యభామ
వలె ప్రేమాంధకారములోఁబడి యుంటిరా? ఈవిశ్వగర్భువి
తులఁదూయ మీకుగాదు, సరికదా బ్రహ్మదేవునకు శక్యమా
నా? శ్రీకృష్ణుండు భక్తవిధేయుఁడు భక్తులైనగాని పరులకు
వశంబౌనా? మీవెఱ్ఱిభ్రాంతి మాత్రము వదలుఁడు.

గీ. నిఖల జగములు కుక్షియం ♦ దేగలట్టి
విశ్వగర్భునిఁ దులదూయు ♦ విత్తమెందు
గలదె యది ఘన భక్తిమా ♦ ర్గంబెగాక
ధనధనేత రమ్ములవేల ♦ తరుణులారా!

కావున నట్టి పరమభక్తుండుగాని పరమభక్తురాలుఁగాని యెవ్వరైన నున్న యెడల చెప్పెరఁదోడి తెండు. మీపతిమీఁకుఁ దక్కఁ నులేదేని వెడలిపొండు.

జాంబ—మిత్రవిందా! రమ్ము! ఈసంగతి మన రుక్మిణీదేవికి తెలియఁ జేయుదము.

(యిరువురు నిష్క్రమింతురు.)

సత్య—(స్వ) ఆహా! ప్రణయాంధనై పతిని సులభుండనియే తలంచితి కాని, పరమాత్ముఁడని దలాపనైతికదా! (ప్రకాశముఁగ) నారదా! త్రిలోకసంచారివి అట్టివార లెవ్వరైన గలరేని వచింపుము. శ్రీఘ్రగతిబ్రార్థించి తోడితెచ్చి మన్నాధుని శ్రమం దీర్చుకొందు.

నార—అమ్మా! చెప్పుదునెదవా? ఒకవేళ నేఁజెప్పిన కోపింతువా?

సత్య—నారదా! నాకోపమెప్పుఁడో పటాపంచలైనది. అనుగ్రహించి వచింపుఁడు తప్పక అట్లుచేసి మన్నాధుని గైకొందు సందేహింపకుము.

నార—అటులైన వినుము.

—॥ మత్తకోకిలావృత్తము ॥—

*భామపట్టపుదేవి రుక్మిణి ♦ పత్నులందునఁబెద్దయా
బ్రేమతోఁదనభర్తకెప్పుఁడు ♦ బ్రీతిసేయుచునుండు నా
కామినీమణి ద్రవ్యమిచ్చుక ♦ కల్గెనేని సమంబుగా
నీమనోహరుతోడఁదూఁగును ♦ నిక్కవంబటుసేయుమా.

సవతియని సందేహింపక అట్లుసేయుము. కృష్ణా! రమ్ము మన మావీధికిఁబోవుదము.

అనుబంధము 14.

(నిష్క్రమింతురు.)

సత్య—(విచారముతో) దైవమా! తుదకెంతటి గతి ఘటింపజేసితివి. సర్వదా నాకు శత్రువురాలైన రుక్మిణినే వేడికోలొనరింపవల సివచ్చెనుగదా! ఆనాడు తాను పుట్టినదినమని నన్ను వీను కోలునకు బిలువవచ్చినప్పుడు విశేషముగఁ దూలనాడితికదా! ఈనాడు నేనే స్వయముగ నామె మందిరమునకరిగి, ఏమొగ మఁబెట్టుకొని ప్రార్థింతును. కటకటా! పాపమునకు బ్రాయ శ్చిత్తమిట్టే కాబోలు సంభవించి తీరును, నళిని! నారదవచ నంబు లాలకించితివిగదే.

గీ. సతము నాకు ఘోర • శత్రువురాలైన
రుక్మిణి న్నిఁకెట్లు • బ్రోవుమనుచు
వేడికొనెఁడుదాన • వెలది నన్నేమి దు
ర్భాగ్యురాలనొకద • యుర్వి నేఁడు.

హా! ఇక విచారించిన లాభము లేదు రమ్ము. ఆరుక్మిణీదేవి కేలొనర్పుదము లెమ్ము.

(నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

చతుర్థాంకము.

—

శ్రీ రస్తు.

# శ్రీకృష్ణ తులాభారము

అను

# తులసీమాహాత్మ్యము.

పంచమాంకము.



స్థలకము—రుక్మిణీదేవిసౌధము.

(రుక్మిణి—జాంబవతి—మిత్రవిందలు ప్రవేశింతురు.)

రుక్మి—ఏమీ? నాధుని నారదునకు దానమిచ్చుటకు సత్యభామ కేమి స్వతంత్రముగలదని యట్లుజేసెనే? జగన్నాధుఁడని తన మనంబున సుంతయుదలపదాయెనుకదా!

*కం. సురముని వ్రతములు సెప్పిన
దురతుర దా దానమీయ ◆ దొరకెనటంచున్
త్వరమునిదానము పట్టుట
హరితగుదునటయు వినిన ◆ నార్యులునగరే.

ఆహా! భగవంతుని లీల లత్యద్భుతంబులుగదా!

జాంబ—అక్కా! యింతకును సత్యభామకుమాత్రము గర్వభంగము ఘటించి తీరినది.

మిత్ర—ఒక్క-గర్వభంగముకాదు. మీఁదు మిక్కిలి నలుగురలో దల యెత్తుకొని తిరుగుట కష్టమే. సరికదా! మనల నికెన్నడు మాళనాడక సమానముగ మసలగలదు.

రుక్మి—ఆమెగర్వమే యట్లు తిరిగి విషసర్పమై తీరినది. అల్లదిగో సత్య
భామ యిటువచ్చుచున్నది. మీరెదురేగి తోడితెండు.

(జాంబవతీ మిత్రవింద లెదురేగి సత్యభామనుతోడ్కొని తెచ్చుచున్నారు.)

సత్య—(విచారించుచున్నది.)

రుక్మి—చెల్లెలా! రమ్ము! ఆపీఠమున గూర్చొమ్ము.

ఉ. మాసినచీరఁగట్టుకొని ♦ మానితభూషణముల్ ద్యజించి పృ
థ్వీసతులెల్లరున్ గనగ ♦ నీవిధినాగృహమందు జేరియా
హా! సుకృతీ! కడున్ గనుల ♦ న శ్రుకణంబులగార్చెదేల? నో
భాసురగాత్రి! దెల్పవె వి ♦ వాదమునీకవె సోదరీమణీ!

సత్య—అక్కా! నీకును నాకును వివాదముఁగలదా? నావివాదము
నాథుని దానముతో చల్లారినది. నావిచారమునకు కారణము
నీకు సోదరీమణులు వచించియే యుందురు.

ఉ. అక్కరొ వచ్చిచెప్పెఁ జతు ♦ రానన పుత్రుఁడు నేను వేఁడఁగా
నొక్కమహావ్రతం బిది మ ♦ హోన్నతభూతి కరంబటంచు నే
మక్కువ నావ్రతంబు సుర ♦ మౌనికతంబునఁ జేయుచుండఁగా
నొక్కకొఱంత పుట్టెఁగరు ♦ ణోదధి నీవది తీర్పగావలెన్.

వ్రతధర్మ ప్రకారము పతిని నారదునకు దానమిచ్చి తిరిగి మామక
ధన సంభారమువలన గైకొన జాలనైతి ఇందులకు నీధనంబు
కొంచెమైనఁ గలసిన నాథుఁడు తూగునని వచించెను నారదు
డు. అక్కా! ఈస్వల్ప కొఱంత దీర్చి నాకృతజ్ఞత కాస్పదురా
లవుకమ్ము. పూర్వవైషమ్యములను వీడుము.

జాంబ—అక్కా! ఇందు కథను తప్పు ప్రాణేశ్వరునిదే? ఏమందువేని,

* గీ. తనకు భామపైని ♦ దరుగని మోహంబె
గలిగెనేని దనకు ♦ గలధనంబు
లీయరాదొ దాన ♦ మిచ్చిన దానికి
దగుదునదగ హరికి ♦ దగునె చెప్పుము.

మిత్రి—వ్రతనియామకమునకు భాగకర్త్రైన సత్య తన్నులకులోను గావలసి వచ్చునేమోయని ప్రాణేశ్వరునకు భయము. అందును

* గీ. విభుని వేడునోము ♦ విభవ విస్తారంబు
మగని తోడి నోము ♦ మంగళంబు
భర్తనెనసియుంట ♦ భామకు భాగ్యంబు
హృదయ నాథునిచ్చు ♦ ఏటివ్రతము?

సత్య—అక్కా! “చచ్చినపామును మరల గొట్టవలెనా?” ఇక నన్ను ఎన్ని దూషణల బెట్టినను కార్యసాఫల్యము కాదు. అజ్ఞానాంధకారమునఁబడి నాథుఁడు జగన్నాథుఁడని తెలియలేనైతి.

* గీ. ఎవఁడు సర్వప్రదాతయౌ ♦ నీశ్వరుండో
తలపకా దివ్యమూర్తినే ♦ ధారవిడిచి
యభిమతార్థంబులను బొంద ♦ నాసపడితి
నిట్టులగునంచు నిందాక ♦ నెఱుఁగనైతి.

రుక్మి—చెల్లెలా! నావద్దధనమున్నదియు లేనిదియు నీవెఱుంగవా? నా ధనసంభారమునగాని, నాథుని తూగడని నారదముని వచించెనా? ఆనారదునకు మాత్రము తెలియదా?

*గీ. పెండ్లినాఁడు మేన ♦ బెట్టినసొమ్ముల
కంటెనొక్కపిన్న ♦ కాసుగాని
యెవరిసొమ్ములేమి ♦ యెఱుగనునారదుం
డెఱుఁగఁడేమి నీవు ♦ యెఱుగకున్న.

జాంబ—అక్కా! తానుదెచ్చిన సమస్త ధనరాసులు దన ప్రియకాంత సత్యభామసౌధమున నిండియుండ మనవద్ద దాచఁబెట్టెనా? ఏమి? ఎన్నఁడును చిల్లిగవ్వయైన నెఱుంగము.

*చ. విభుఁడొటమున్ననేమి బది ♦ వేలదిమాకును నేటిదాక భా
మభవనవాసుఁడయ్యెనిక ♦ మానిమతంబుననుండుగాక యీ

రత్నసముతేలమూలు ధన ♦ రాసులులేవని తానెఱుంగుమే
లు భళి! మనోహరున్ను నిజ♦మున్ గొనిపొమ్మనుడిచ్చినందుకున్.

మిత్ర—అక్కా! మనవద్ద చిల్లిగవ్వయైన లేదనుమాట తానెఱుంగదా
యేమి? త్వరపడి దానమునకుసిద్ధపడిన ప్రాణేశ్వరుని నిజము
నారదునకు దాస్యముసల్ప నివ్వవలసినదే.

సత్య—అక్కా! రుక్మిణీదేవి! నన్ను మీరలెంత దెప్పినను యేమియు
లాభము లేదు. వైషమ్యములను వదలి నాయందును నాథుని
యందును కృపవహించినారదు చెరనుండి నాథునివిడిపించుము

*క. పరమేశ్వరుండు పతిగాఁ
బరమేశ్వరివనతి నైన ♦ భాగ్యముగనియుం
గరువంబుఁ జెందియాగితి
పరిహాసంబులకుఁ బాలు ♦ పడితిని తుదకున్.

నీవు కేవలము పరమేశ్వరివికాని, రుక్మిణీదేవివిగావు? అక్కా!
నావేడికోలాలకించుము నేను సర్వదా నీకు కృతజ్ఞురాలను.

రుక్మి—చెల్లెలా! ఇప్పటికి సుజ్ఞానివైతివి. యికమీదటనైన నాథుని
జగన్నాథుఁడని యెఱిఁగి భక్తి గలిగియుండుము. నేనిదేతులసీ
పూజ పూర్తిఁజేసి వచ్చెదను. ముందునీవు నిష్క్రమించుము.

సత్య—మంచిది. అక్కా! నీవును త్వరలోరమ్ము.

(నిష్క్రమించుచున్నది.)

జాంబ—అక్కా! మనగృహంబులందు యేమిధనధనేతరమ్ములుగల
వని ప్రాణేశ్వరు దులదూయుదువే.

రుక్మి—చెల్లెలా! నీవును వెర్రిలోబడియుంటివా? మననాథుడు జగ
న్నాథుడుకాని మానవమాత్రుడుగాడు. అట్టివానిని తులదూ
యుటకు ధనధనేతరమ్ములుకావలయునా? భగవంతుడు భక్తి

విధేయుఁడుకాని, ధనధనేతరవిధేయుఁడును భార్యావిధేయుఁడునుకానేరడు.

సీ. ఎవ్వానినామంబు ♦ నెదదలంచినయంత
దోషంబులన్నియు ♦ దొలఁగిపోవు
నెవ్వాని సత్కృప ♦ యింతలేకున్నచో
జంతుజాలములన్ని ♦ సమసిపోవు
నెవ్వాని సత్కీర్తి ♦ నెల్లలోకములందు
సాధురక్షకుఁడంచు ♦ జాటుచుండు
నెవ్వానినేత్రము ♦ లీప్రపంచంబున
నినశశిమూర్తులై ♦ తనరుచుండు
గీ. ఎవని నామము జపియింతు ♦ రవనిమునులు
అట్టిసజ్జనపోషకుం ♦ డైనయట్టి
యాదిమధ్యాంతరహితున ♦ కమలమతికి
నిత్యభక్తులుకండెయో ♦ నెలతలార.

తులసీపూజగావించి పిదప నాధుని విడిపించుకొనవచ్చును. లోనికిఁబోవుదము రండు.

(నిష్క్రమింతురు)

---

2. వ. రంగము.

---

(వసంతుఁడు—గర్గుఁడు ప్రవేశింతురు)

గర్గు—ఏమి, వసంతా! ఈతొందర.

వసం—తొందరఁగాకేమి? శ్రీకృష్ణుని సత్యభామాదేవి తన ధనసంభారముచేఁ దూయలేకపోయినను, మారుక్మిణీదేవి ఒక్కతులసిపత్రముతో తననాధుని తూఁసుకొనునట.

గర్గ—వారెల్లరు తులామంటపమునకు దయచేసియున్నవారా ?
వసం—సరిసరి! కబుర్లతో కాలము గడుపుచుంటివాయేమి? అందరును వచ్చియే యున్నారు. యిక నీయాలశ్యమే.
గర్గ—అటులైనపద.
వసం—నీవుముందు దయసేయుము. నేను నాభార్య నెటులైన నిచ్చటకుఁ దోడితెచ్చి ఆభక్తిదృశ్యముఁ జూపి సత్యభామవలె భక్తురాలింజేసెద.
గర్గ—నీభార్య సత్యభామవంటిదాయేమి?
వసం—సత్యభామ ఒక్కతన్నుతోనే సరిపెట్టినదికాని, మాయింటియాపె తన్నులు గుద్దులు పోటులు—చెప్పతరముఁగాదు, నిజమునకు సత్యభామకంటె మాయింటియాపె పదియాకులెక్కువ చదివినదేగాని తక్కువ చదువలేదు.
గర్గ—వెఱ్ఱివాడా! అట్టి కఠినహృదయురాలు యీదృశ్యముగాంచినయంతనే భక్తురాలౌనా యేమి?
వసం—ఒక్కనాభార్యయేగాదు. యీనాటకము జూచిన వారెల్లరు భక్తియందుఁగల ప్రభావము గ్రహింపకపోరు. పతియేప్రత్యక్షదైవంబను ప్రమాణము తప్పఁబనకపోరు.
గర్గ—అటులైన శీఘ్రముగతిఁ దోడితెమ్ము.

(చెరియొక వైపునకు నిష్క్రమింతురు)

ఇంద్రు—(ప్రవేశించి) ఆహా! శ్రీమన్నారాయణుని కపట మనోహర నాటకము దురూహ్యముగదా! ఎంతలో పోయిన పారిజాత వృక్షంబును నేత్రానందముగ గాంచగంటిని. నామనోహారి సంతాపమెంతలో హరించినది. భగవంతుఁడు భక్తాధీనుఁడు కాని ప్రేమవిధేయుఁడుఁగాఁడుసుమా! తొలుతనే నాసర్వేశ్వరుని సులభుండని దలంచితికాని భక్తవిధేయుఁడనిఁదలంపనైతి.

నారదమహాముని భక్తాగ్రేసరుఁడుగనుక నాతనివశమయ్యెను, యితరులవశమౌనా? యిప్పుడు నేనా సర్వేశ్వరుని దర్శించి ధన్యుఁడ నయ్యెదగాక!

(నిష్క్రమించుచున్నాఁడు)

తెరవ్రాలును.

---

3. వ. రంగము.

దృశ్యము—దానమంటపము, తులాభారము.

---

(కృష్ణుఁడు—నారదుఁడు—వసంతుఁడు—గర్గుఁడు—అక్రూరుఁడు సత్యభామ—రుక్మిణీ జాంబవతీ మిత్రవిందలు మొదలైన వారు ప్రవేశింతురు)

గర్గ—నారదా! ఇక నాలశ్యమేమిఁగలదు? కృష్ణుని తులలో గూర్చొన బెట్టుము.

నార—కృష్ణా! రమ్ము! ఈతులయందధిష్ఠింపుము. (కృష్ణుఁడు తులలో గూర్చొనుచున్నాఁడు)

రుక్మి—నాథా! జగన్నాథా! ఇది కలయా? నిక్కవమా? అహా! నా రయణా తావకప్రభావమెఱుఁగ నాతరంబౌనా?

శా. దేవా భక్తచరిత్రులన్ ఘనకృపా ♦ ధీనుండవై కావవే
దేవా బ్రోవవె తొల్లి ద్రౌపదిని కుం ♦ తీపుత్రులన్ ప్రేమతో
బ్రోవన్ లేదె కుచేలునిన్మరియు నీ ♦ భూమండలంబందునన్
దేవా నమ్మినవారిఁగావవె కృపా ♦ ధీనుండవై మాధవా!

నారదా! ఇదినిజమేనా? నాచెల్లెలు నాథుని నీకుధారవోసి నదా? లేక యిది నీకపట నాటకమా?

నార—విదర్భరాజపుత్రీ! ఇందు కపటమేమియును లేదు.

*సీ. వినవమ్మ రుక్మిణి ♦ విభునిదానమొసంగె
సాహసంబున నాకు ♦ సత్యభామ
తిరుగ నాతనితోడ ♦ సరిధనంబిచ్చి త
ద్విభుగొన నాత్మమం ♦ దిరమునగల
ధనమెల్ల జాలక ♦ తనబంధుమిత్రాది
ధనములెల్లను వైచి ♦ తగకయున్న
దనయింట నెప్పుడు ♦ దనరుభూషణములు
వైచిన నించుక ♦ వాసితగ్గ
గీ. గాన నీధనమించుక ♦ కలిసెనేని
వనజలోచనుతోసరి ♦ వచ్చుననుచు
దలచియున్నది కృష్ణుండు ♦ వలసెనేని
తరుణికొనవమ్మ భాగము ♦ దంబు నొంద.

జాంబ—ఇందు నిజమునకు మీరుముప్పురు దోషులేయగుదురు. తగు దునని పతిని దానమిచ్చుటకు సత్యభామకేమి హక్కుగలదు. అందులకు మాప్రాణేశ్వరుఁడేల సమ్మతింపవలెను. సమ్మతించె బో, నారదా! నీవేల దానము స్వీకరించితివి? ఇదియంతయు బహుచిత్రసంఘటనవలె దోచుచున్నయది.

మిత్ర—ఇంతకు ఈసత్యభామకు మాత్రము తగిన గర్వభంగమైనది.

కృ—ఓమగువలారా! మీరామీపై మన్యుములను వీడుఁడు. వైదర్భీ! నన్ను త్రాసున తూగుకొనదవా లేదా?

రుక్మి—దేవాదిదేవా! పురాణపూరుషా! నీమహాప్రభావం బెఱుంగ నెవరికిశక్యము. నీకపటనాటకయర్థంబు విపులంబుగా గ్రహింప నెవరిసాధ్యము. నారాయణా! వేదపారాయణా!

సీ. ప్రహ్లాదు బాధలు ♦ బాపిరక్షింపంగ
దివిజారిజీవముల్ ♦ త్రెంచినావు
మత్తేభమానాథు ♦ మకరినోటనుజిక్కి-
ప్రార్థింప వచ్చికా ♦ పాడినావు
పతిశాపమహిమచే ♦ పతితయైపడియున్న
పడతిశాపము వేగ ♦ బాపినావు
అల కుచేలుని గుప్పె ♦ డటుకులభక్షించి
సకలసంపదలిచ్చి ♦ సాకినావు

గీ. వారు వీరననేల నె ♦ వ్వారినైన
శరణటన్న జాలునటంచు ♦ నరసితీవు
ధరభవద్మాహాత్మ్యంబెన్న ♦ దరమె దేవ
ధాతకైనను పార్వతీ ♦ ధవునికైన.

నిర్వికారుఁడవు—నిరంజనుఁడవు—నిర్గుణుండవు. అట్టి నీలీలల యందుగల విపులార్థము గ్రహింప నాకుమాత్రము శక్యం బౌనాశి కేవలము భక్తాధీనుండవను లోకోక్తి ననుచరించియే నీపనికై యూనుచుంటిని. జగన్నాథా! సెలవిండు.

కృ—దేవీ! అట్లే కార్యవిజయురాలవై ప్రపంచ ప్రఖ్యాతి గడించెద వుగాక.

రుక్మి—నాథా! భవదీయ కరుణావృష్టి నాపైజల్కిన నాకిదియొంతపని. సత్యా! ఈతుల యందున్న నీచపదార్థములను తీయించి వేయుము.

వసం—అమ్మా! ఆపని ముందు నేనేఁ జేసెదను.

(త్రాసునగల ధనము తీసివేయుచున్నాఁడు)

నార—సత్రాజితీదేవీ! ఒక్కమాట మఱచితి. నీభర్త నెవరుతూసు కొనియెదరో వారికే వశీకృతుఁడౌనుసుమా?

మిత్రి—నారదా! అందులకు తనకిష్టమో అయిష్టమో? ఆసంగతి నడుగుము.

నార—సత్రాజితీదేవీ! అందులకు నీకు సమ్మతమా?

సత్య—నారదా! నాకీగర్వభంగము చాలదనియా నీవిట్లడుగుచుంటివి? జగన్నాథుఁడు భక్తాధీనుడను ప్రమాణము గ్రహించితి కాని. గ్రహింపక పోలేదు. సమ్మతియని వేరు చెప్పవలయునా?

కృ—(స్వ) ఈసత్యాదేవి సుజ్ఞానియై భక్తియందున్న ప్రభావముఁ దెలిసికొనగల్గిన యింకనుఁ దెలిసికొనగలదు. (ప్రకా) వైదర్భీ! చూచెదవేల?

గర్గ—అమ్మా! ఇక నీవు నీపతినిఁ దూసుకొనుము.

రుక్మి—(తులసిదళముఁ జేతబట్టి) ఓసభాసదులారా! భగవంతుఁడు భక్తాధీనుఁడుగాక ప్రేమాధీనుడౌనా? ధనధనేతరమ్ములేల? నేను నాభగవంతుని—నాప్రాణధవుని ఒక్క తులసీదళములో దూసెదగాక!

మ. ఫలపుష్పంబులో లేక గంధమొకడున్ ♦ పానీయమో శాఖమో
తులసీపత్రమొ లేక యేతృణమొ సం ♦ తోషంబుగా భక్తియై
తులయందుంచిన దైవమేవిధమునన్ ♦ తూగండో నేజూచెదన్.
(త్రాసుచుట్టు మూడుసార్లు దిరిగి)
తులసీ పత్రమిదే పరాత్పరుఁడికన్ ♦ తుల్యంబుగా తూగుతన్.

(తులసీపత్రముపైన శ్రీకృష్ణుఁడు సరితూగుచున్నాడు)

నార—ఆహా! ఈరుక్మిణీదేవి భక్తియనన్యమైనదిగదా! (తులసిపత్రము చేతబట్టుకొని) సభాసదులారా! ఈతులసీదళముయొక్క ప్రభావంబు వర్ణనాతీతముగదా!

*క. తులసీకాననమెచ్చట
విలసితమైయుండునచట ♦ విలసన్ముఖుడై
జలధిరమాసహచరుడై
విలసిల్లుచునుండుశౌరి ♦ వేల్పులుగొల్వన్.

*క. అనుదినము నెవరుతులసీ
వనమునిరీక్షింతురట్టి ♦ వారలనెపుడున్
ఘననాశ్రయింపనఘములు
వినుముజ్వలదగ్నిమునక ♦ వితతులభంగిన్.

(అప్పుడు యింద్రుడు ప్రవేశించుచున్నాడు.)

ఇంద్రు—శ్రీకృష్ణపరబ్రహ్మకు ప్రణామములు.

కృ—కల్యాణమస్తు! దేవేంద్రా! నీసందేహము దీరినదికదా!

ఇంద్రు—మహాత్మా! తావకీనకృపాదృష్టివలన పారిజాతవృక్షంబు లభించుటయేగాక, భక్తియొక్కగల ప్రభావము నేత్రానందముగ గాంచగంటిని.

అక్రూ—కృష్ణా! విశ్వకల్యాణమునకై ప్రదర్శించిన విచిత్రనాటకము గాంచి మేమెల్లరము ధన్యులమైతిమి.

సత్య—అక్కా! నీవింతటిభక్తురాలవని గ్రహింపక నిన్నెన్నియోవిధముల దూషించితి. క్షమింపుము.

రుక్మి—చెల్లెలా! నీవును సోదరీమణులును నిరంతరభక్తురాండ్రై వరలెదరుగాక!

నార—తథాస్తు!

కృ—దేవేరులారా! మీరెల్లరు నాయందుభక్తి కలిగియుండెదరుగాక! నారదా! సురకార్యము నెరవేరినదిగదా! నీకింకేమయిన సందేహముగలదేని వచింపుము.

నార—దేవా! నీకృపావృష్టివలన సురకార్యము నెరవేరినది. రుక్మిణీదేవి భక్తిలోకవిదితమైనది. సత్యాదేవి భక్తురాలాయెను. నాకింకేమిగావలయు. అయినను యిట్లగునట్లనుగ్రహింపుము.

గీ. అవని సస్యములభివృద్ధి ♦ నందుగాక!
ప్రజలలో సర్వదాభక్తి ♦ ప్రబలుగాక!
కలిమిజనులకు నిత్యంబు ♦ గల్గుగాక!
క్షితిని శ్రీదొంగలక్ష్మీ నృ ♦ సింహాకృతియ
ఖండస్తుతిపాత్రమైసదా ♦ క్రాలుగాక!

కృష్ణ—తథాస్తు.

అనుబంధము 15.

మంగళము.

గద్య.

ఇది శ్రీరమానాధధ్యానసేవాతత్పర తెలుగు మహా
మునిగోత్రస్య పవిత్ర దొంగవంశపయోరాసి
నరసమాంబాపేరనార్య చతుర్థపుత్ర
లక్ష్మీనరసింహనామధేయ ప్రణీ
తంబైన శ్రీకృష్ణతులాభార
మను తులసీమాహాత్మ్యము
సర్వము సంపూర్ణము.

---

శ్రీరామప్రెస్, రాజమండ్రి.—1981.

# అనుబంధములు.



## 1 అనుబంధము—ఇంద్రుడు.

### ఖరహరప్రియ—ఏకతాళము.

ఓప్రాణకాంత కడుధృతిదూలి
ఈపగిదిగ మదిచింత వహించుట
కేఘనకార్యము చెప్పుమా ॥ఓప్రా॥
మామకమానసమదిచెడె సఖియా! మానగదేచింతగ
కోమలి నీకయినాదగుకార్యము కూడవదలితినిసుమ్మా ॥ఓప్రా॥

---

## 2 వ అనుబంధము—శచీదేవి.

### డిండోల్—ఆదితాళము.

పరాభాగ్నిన్ని కెటులసైతునో । పరమసుమవృక్షుంబెటుగాంతునో ॥ప
గర్వితచిత్తయా । కాంతమములగనక
గర్వముతో పరిభవించెను దైవమ!
అకటా! యామెకు నంతటిగర్వము।
యాక్మగలిగె పతివశ్యుండామెనని ॥పరా॥

---

### 3. అనుబంధము—నారదుండు.

మోహన—చతురశ్రి.

జగ । ముల కధిపతినీవే ॥జ॥

ఖగముల । మనుజుల । కాలసర్పముల।

జలచరముల మరి సకలంబున్।

ధరమది ఘనదయ । దనరవిచిత్రం।

బుగపరిపాలించెడి ఘనదేవా నిను నే

దగుభక్తిని గొల్తున్ ॥జగ॥

---

### 4. అనుబంధము—కృష్ణుండు.

బ్యాగ్—ఆదితాళము.

(రుకి ఆయీ అబరియావలె)

అతివిచిత్రమగు । బృందావనమున్ ।

గాంచిన క । న్నులపండుగయా ॥అతి॥

మంచిగులాభీ తరులవి మరియున్

మల్లెలు మొల్లలు హాయిగొలుపుచూ

మనకతిమోదము నింపెనుగా ॥అతి॥

---

శ్రీ

## 5. అనుబంధము డైలాగు.

### మోహన—ఆది.

రుక్మి—వినుసత్యా! నావిన్నపమదినీ । వీనులవేసెద ననన్యదయతో॥వి

వినయముతో నినువేడెద భర్తను । కరుణతోబంపవే।

కల్యాణీ యిక ॥విను॥

సత్య—బాగునన్ను వేడనేల । ప్రాణధవుని వేడరే।

జాగుసేయనేల ధవుని । సాగిలినుతియింపరే॥

లేకయున్న పదపడి వన । లీలలందఁగ౯ పదరే।

నాకుగలదె గృహముకనుప । నాధుని౯ వివాదమేల॥

రుక్మి—ఇంతనిర్దయాత్మురాల। నీవని మదిదలచనే

కృష్ణ—స్వాంతమునన్ ధర్మమెంచి । సమ్మతింపవే మానిని॥

సత్యా—మారుమాటలాడకర । మ్మా మదీయ సౌధముకే

గారవమది గలిగననీ । కాంతలతో నేగుమా॥

జాంబ—పాపి! నీగర్వసమస్తము । భంగంబవు గర్వింపబోకుమా॥

[చతురశ్రి]

సత్య—నిందపలుకులిటు పలుకుట నీకుమేలెకోపినీ!

[తిశ్రగతి]

కృష్ణ—వాదమేల మగువలార । మానరేశాంతముబూనరే॥

రుక్మి—వినుసత్యా॥

### అనుబంధము. 6.

ఢై లాగు—శంకరాభరణము—ఆదితాళము.

కృష్ణు—ఓకాంతా । కడుశాంతముగను బలు । కవేలా
అతాంగీ । మదినెంతో । యాగ్రహమును బూనకు
రంతమాగాదె ॥ఓ॥

సత్య—వలదుడుగూ । కా । వలసినభూమిని । భవ
నంబదిగదా । అనురాగము । గను శీఘ్రము । గనునే
లుము । సతియేరుక్మిణి । గతిగాకిక । నరుగదగదో
ననుయిక నిటువేసుటతగదో ॥వల॥

కృష్ణు—అలుకా । యో రా । చిలుకా । నే వెడలిన విందునకూ
తగునే । మగువరో కోపము । తగదికనాతో । దుత
జరియింపవె ॥కాంతా॥

---

### అనుబంధము—7—కృష్ణుడు.

బీగఫలాస్—ఆదితాళము.

పడతీ । పరుషములగుపలుకులవిడచీ । కరు
ణింపుముననుదయవిడకా ॥పడ॥
నినుబ్రాణము । గనుగాచిన । ననుకోపమునను
గనకా । వినురుక్మిణి । ఘనగృహమునకిక
బోయినదండన । సేయవె ఘనముగ ॥పడ॥

---

## అనుబంధము—8. సత్యభామ.

### బ్యాగ్—త్రిశ్రగతి.

తగదు తగదు వెడలతగదు నారదా । ధ
వునోసగుము దయదలపుము ॥తగ॥
వ్రితమనిమిషపన్నినా । పతిగొని నిటు సేతువా
బ్రితుకజాల । పతినివీడి । విదితగుణ । విధ
వరసుత ॥తగ॥

---

## అనుబంధము 9. నారదుఁడు

### బ్యాగ్—త్రిశ్రగతి.

సరిసరికదుసరసమెయిది భామినీ । జగ
తిజనులు । నగరెవినిన ॥సరి॥ ధరమదవతి
దెలిసెనే । తావకఘనవ్రితమహా । ధవునితూ
యు । ధనములేక । విడచితివిక । పడతిచ
నము ॥సరి॥

---

## అనుబంధము. 10. శైలాగు

### సారంగ—ఆదితాళము.

పల్లవి—చింతవిడఁవవమ్మా । దేవీ ఈ ఈ ఈ ఈ
సదమలగాత్రి ॥చింత॥ భూరికృపాత్ముఁడు । బాత్రి
పకమానుఁడు । ధారుణిధృతిమదిగనవమ్మా
జగవతిమా । జగవినుతా । మదినిక ॥చింత॥

సత్యా—వ్రతనేపంబునం మునీశుడీవిధిసలిపెను కడుఁ । సతతముమతిచెడె చెలియరో । పతి నే । గతినిం । బడయుదు ॥చింత॥

---

అనుబంధము 11. నారదుఁడు.

రాగమాలిక.

మాయామాళవగౌళ—రూపకము.

బలేమంచి చిత్రిబేరమూ । ఈబేరమూ
రండవూరో పరీక్షింప । రమానాధు ॥బలే॥

సారంగ—రూపకం.

సాదులైనవారికి । కడు । చౌకయైన బేరము
లేదు యిట్టినికరముగను । లీలజెలగుబేరమూ
వాదమదేలను యిది నా । వశ్యమైనబేరమూ
శ్రీధవుగొనరారెవిూరు । శీఘ్రగతిని సిరుల్
దనర ॥బలే॥

నాధనామక్రియ—రూపకం.

కూరులైనవారికిద్ది । కొననసర్వా బేరమూ
చోరులైన వారికిదీ । చూడదగనిబేరమూ
ధీయలకిది కష్టమైన । దివ్యమయిన బేరమూ
ధారుణితలమున వలిపి । తాపపలకు సాధ్యము యిది ॥బలే॥

## 12. అనుబంధము డైలాగు

మోహన—ఆదితాళము.

నార—బాగుబాగు నీప్రకర్తనము సుమ్మా బాగుగ దెలిసెను ॥బాగు॥
బాగయ్యెను యోగ్యాబయ్యెను । కడు । బాల
యేల నీవిటుల్ వగవగ ॥బాగు॥

సత్య—మనవి వినుము నారదా । మాధవునిక విడువనా ।
ధనకనకము మించిన నా । ధవుని దయనోసంగుమా॥

కృష్ణ—దానధర్మ మీావిధమున ధరశీసల్పి వగతువే।
దానమిచ్చియో సతీ । తపసిని దూషింపకే

నార—భువినిగలుగు నీకుసతము భూరికీర్తి పొమ్మువేగ॥

సత్య—ధవుమహాత్మ్యమెఱుగకేను । ద్వారపడితిని నారదా॥

---

## 13. అనుబంధము—సత్యభామ.

దర్బారు—ఆదితాళము.

నేటికిట్లు నా । ప్రియుడు వ నినరు
వశ్యమాయె నాకతన నకటా ॥నేటి॥

సాటిలేనియా । సౌందర్యంబూ
దీటులేనియా । దివ్యప్రణయము
మాటికి నేటికి । మఱువగ గలనా
మృగనిభీడి మహిమనగలనా ॥నేటి॥

---

## 14. అనుబంధము—నారదుండు.

మాయామాళవగౌళ—చతురశ్ర.

భజగోవిందం । భజగోవిందం గోవిందం
భజ మూఢమతే ॥భజ॥

సంప్రాప్తే సన్నిహితే కాలే । నహినహిరక్షతి
డుకృఞ్ కరణే ॥భజ॥

---

## 15. మంగళహారతి.

మంథరధర । మంగళకర । మంగళాంబురా।
మారసుందరా । శ్రీరమేశ బ్రోవరా ॥మం॥

దాసభరణ । దోషహరణ । దానవేశనాశా।
శ్రీనివాసజగదీశా। రాజరా। జేశ్వరా । మోపరాత్పరా ॥మంగ॥

సమాప్తము.



# ఆంధ్రనాటకములు.

## విప్రనారాయణచరిత్ర

(గ్రంథకర్త:—పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు)

ఈనాటకము జగద్విఖ్యాతిఁగాంచిన రంగమార్తాండ కపిలవాయి రామనాథ శాస్త్రిగారిచే యాక్టుచేయఁబడి జగత్ప్రసిద్ధిఁగాంచినది. కస్తూరిరంగని సందర్శనాభిలాషియగు విప్రనారాయణుని భక్తిపారవశ్యము చూచి చదివి యానందించవలసినదే! వేశ్యకు భక్తియుండునా? తాను తీనయక్కయు గలహించి విప్రనారాయణుని విటునిగాఁజేసినది. ఆళ్వారులు వేశ్యావీథిని పడబడినారు. మహావిష్ణువు నామోచ్చారణము మాని మదననామోచ్చారణమువైపు మరలినారు. భక్తి యంతయు రక్తిలోనికి మారినది. కైంకర్యమంతయు కామమ్మగారి యింటిలోనే. తుదకు యాశ్రీరంగని కటాక్షమున విఫలమనోరథుఁడు గాక సఫలమనోరథుఁడైనాడు. ఎక్కడ జూచినను భక్తి, శృంగారముఁగూడ జూడవలసినదే! హాస్యరస మంతకన్న గమనించవలసినదే! వేడే ఒకకార్డు వ్రాసి ఒక్కపుస్తకము తెప్పించుకొనుఁడు. గ్లేజు పేపరు వెల 1 రూపాయి

## రామదాసు.

(గ్రంథకర్త:—బళ్ళారి ధర్మవరం గోపాలచార్యులుగారు.)

అధునికకాలమునందలి యాంధ్రనాటక సమాజములవారి కంఠలంకృతము ముంగొంగుబంగారమై యున్న రామదాసునాటకమును, అందలి మాధుర్యరసపూరిత కీర్తనలను, యెరుఁగనివారుండరు. మన భాషలో నెన్ని రామదాసునాటకములు రచింపబడినను రంగస్థలమున ప్రదర్శింపబడువ దిదియొక్కటియే! ఈనాటకప్రాశస్త్యమును మాటలతో వర్ణింపబూనుట సూర్యుని దీపికతో జూడదలంచుటయే!

వెల రూ 1—0—0

## నలభీమపాకశాస్త్రము.

ఇంగువకూరలు, పిండివంటలు, పచ్చడులు, ఫలహారములు, ఊరకాయలు, అప్పడ వడియములు, మొదలగునవి తయారుచేసుకొను విధము షుమారు వందలకొలది రూపములు తయారు కాబోవు విధము. వెల రు. 1—0—0.